శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమతే నిగమాంతమహాదేశికాయ నమః

# శ్రీ వేదాంతదేశిక స్తుతిమణిమాలా-1

వరదరాజ పెరుమాళ్, కాంచీపురం



'పండితరత్న' డా|| ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి అహ్మగ శింగరాచార్యులు

సమర్పణ: ఈయుణ్ణి అనంత రంగరామన్

# విషయ సూచిక

# శ్రీకుమార వరదాచార్యస్వామి వైభవమ్

★★★★

(శ్రీ హయగ్రీవ విద్యాపీఠంద్వారా క్రీ. శ. 2023వ సంవత్సరంలో ముద్రింపబడిన "సత్సంప్రదాయ సౌరభమ్" అనే గ్రంథం నుండి సేకరించిన వివరాలు. ఈ గ్రంథం శ్రీ తిరుప్పుట్కుழி స్వామివారి 181 వ నక్షత్ర సందర్భంగా ముద్రింపబడింది)

కుమార వరదాచార్య స్వామివారు వేదాంతదేశికుల కుమారులు. వీరికి నయన వరదాచార్యులు అని కూడా పేరు ఉన్నది. వీరు ఆవణి (శ్రావణ) మాసం రోహిణి నక్షత్రంలో క్రీస్తు శకం 1317 వ సంవత్సరంలో దేశికులకు 49వ ఏట జన్మించారు. వీరు శ్రీరంగంలో అవతరించినట్లు తెలుస్తున్నది. వీరు తమ తండ్రి వద్దనే సకల శాస్త్రాలను అభ్యసించి, అనతి కాలంలోనే పరిపూర్ణమైన పాండిత్యాన్ని గడించారు. వేదాంతదేశికులు తమ గృహంలోని అర్చామూర్తి అయిన వరదరాజస్వామి పేరునే తమ కుమారులకు పెట్టారు. వేదాంతదేశికులు పరమపదించిన తరువాత కుమార వరదాచార్య స్వామివారు భగవద్రామానుజ సంప్రదాయ ప్రచారాన్ని కొనసాగించి, అద్వితీయంగా నిర్వహించారు. వీరు ఆసేతు హిమాచలం పలు ప్రాంతాలలో పర్యటించి, పలువురు ప్రతివాదులను వాదంలో జయించి, సిద్ధాంతస్థాపనను చేశారు. సింహాచలం, అహోబిలం, శ్రీకాకుళం మొదలైన ఆంధ్రదేశంలోని ప్రాంతాలలో కూడా వీరు పర్యటించారు. తమ శిష్య పరంపరను ఈ ప్రాంతాలలో విస్తరింపజేశారు.

సాంప్రదాయకమైన వివరాలనుబట్టి కుమార వరదాచార్య స్వామి వారు కొన్ని రహస్య గ్రంథాలను కూడా తెలుగులో రచించినట్లు భావింపబడుతున్నది. తమ తండ్రి అయిన వేదాంతదేశికుల వలె వీరు కూడా రాచకొండ ప్రభువులచే, సర్వజ్ఞ సింగభూపాల నాయకునిచే ఆదరింపబడినట్లు తెలుస్తున్నది. ఆంధ్రదేశంలోని మంగళగిరి, ఒంటిమిట్ట, ఒరిస్సా రాష్ట్రంలోని (పురుషోత్తమం) పూరి క్షేత్రం, మహారాష్ట్రలోని షోలాపూర్ మొదలైన

ప్రాంతాలలోని దేవాలయాలలో వీరు ఏర్పాటు చేసిన సంప్రదాయం ఈనాటికి కొనసాగుతున్నది.

18 సర్గలను కలిగిన "ఉదార రాఘవం" అనే కావ్యాన్ని రచించింది శాక్యమల్లుడనే అద్వైత పండితుని వీరు సింగమనాయకుని సభలో వాదనలో ఓడించారని కొందరు పరిశోధకుల అభిప్రాయం. వీరు జయనామ సంవత్సరం ఫాల్గునమాసం కృష్ణ సప్తమితిథిలో పరమపదించినట్లు తెలుస్తున్నది.

ఎన్నో గ్రంథాలను వీరు రచించినప్పటికీ, ప్రస్తుతం 36 గ్రంథాలు మాత్రం మనకు లభిస్తున్నవి. వీటిలో కూడా ఐదు మాత్రమే ముద్రింపబడినవి.. మిగిలినవి అన్ని లిఖిత గ్రంథ రూపంగానే ఉన్నవి. సంగ్రహంగా వీరు రచించిన గ్రంథాల వివరాన్ని ఈ విధంగా భావించవచ్చు.

**సంస్కృత గ్రంథాలు**

1) భగవద్ధ్యాన పద్ధతి– ఇది 12 శ్లోకాలు కలిగిన కృతి ఇది విజయవాడకు సమీపంలో ఉండే శ్రీకాకుళం అనే గ్రామంలో ఉండే స్వామిని ఉద్దేశించి రచింపబడింది .ఇది దేశికుల భగవద్ధ్యాన సోపానాన్ని అనుకరిస్తున్నది.

2) హరి సందేశం,

3) కోకిల సందేశం – ఇవి రెండు వీరిచే రచింపపబడిన సందేశ కావ్యాలు.

4) లక్ష్మీ శతకం– నూరు శ్లోకాలు కలిగిన, లక్ష్మిని స్తుతించే స్తుతికావ్యం.

5) శంఖశతకమ్– ఇందులో భగవంతుని శంఖం పాంచజన్యాన్ని స్తుతించే నూరు శ్లోకాలు ఉన్నాయి.

6) శుకసందేశం – ఇది కూడా భగవంతుని దగ్గరకు సందేశాన్ని పంపించే రీతిలోని సందేశ కావ్యమే.

7) శ్రీ వేదాంత దేశిక దినచర్య– శ్రీ వేదాంతదేశికుల అనుష్ఠానక్రమాన్ని తెలిపే సంగ్రహమైన స్తోత్ర కావ్యం ఇది.

8) శ్రీ వేదాంత దేశిక మంగళమ్– వేదాంతదేశికులను ఉద్దేశించి మంగళాశాసన ప్రక్రియలో రచింపబడిన స్తుతి

9) ఈ వేదాంత దేశిక ప్రార్థనాష్టకం– వేదాంతదేశికులను ప్రార్థిస్తూ రచింపబడిన ఎనిమిది శ్లోకాలను కలిగిన స్తుతి.

10) శ్రీ వేదాంత దేశిక దివ్య మంగళ విగ్రహ ధ్యానం – ఇది శ్రీవేదాంత దేశికుల దివ్య మంగళ రూపాన్ని వర్ణిస్తూ రచింపబడిన స్తోత్రం. ఇది దేశికులు అవతరించిన తూప్పుల్ అగ్రహారంలో ఉండే వేదాంతదేశికుల అర్చామూర్తిని ఉద్దేశించి రచింపబడింది.

11) శ్రీ వేదాంతదేశికప్రపత్తి – శ్రీ వేదాంతదేశికులను ఉద్దేశించి ప్రపత్తిక్రమంలో రచింపబడిన స్తుతి.

12) త్యాగ శబ్దార్థ నిర్ణయం– ఇది శ్రీకృష్ణ చరమశ్లోకంలోని "సర్వ ధర్మాన్ పరిత్యజ్య" అనే ప్రయోగంలోని అర్థాన్ని వివరించే గ్రంథం.

13) విరోధి భంజని– ఇది పరవాదులను నిరసిస్తూ, విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని స్థాపించే వేదాంత గ్రంథం.

**ద్రావిడ గ్రంథాలు**

పిళ్లై అందాది– ఇందులో 20 పాశురాలు ఉన్నాయి . ఇది ఇరామానుశ నూత్తందాదిని, కణ్ణినుణ్ శిఱుత్తాంబు ప్రబంధాన్ని అనుకరిస్తూ ,వేదాంతదేశికుల కళ్యాణ గుణాలను వర్ణింస్తూ రచింపబడిన ద్రావిడ ప్రబంధం.

**దేశిక గ్రంథాలపై వ్యాఖ్యానాలు**

1) అధికరణ చింతామణి – ఇది వేదాంతదేశికుల అధికరణసారావళి పై వ్యాఖ్యానం

ఆశ్రయానుపపత్తి– ఇది అద్వైతులను నిరసిస్తూ భగవద్రామానుజులు శ్రీ భాష్యంలో చెప్పిన ఏడు విధాలయిన దోషాలలో ఒక దోషమైన ఆశ్రయానుపపత్తి అనే దోషాన్ని వివరించే గ్రంథం.

చిదచిదీశ్వర తత్వనిరూపణం– శ్వేతాశ్వతరోపనిషత్తులోని " భోక్తా భోగ్యం ప్రేరితారం చ మత్వా" అనే మంత్రాన్ని వివరించే గ్రంథం.

4)తత్త్వత్రయనిరూపణం ( తత్వత్రయ చుళకార్థసంగ్రహం) – దేశికులు రచించిన "తత్వత్రయ చుళకమ్" అనే గ్రంథానికి వ్యాఖ్యానం,

5) న్యాస తిలక వ్యాఖ్యానం– దేశికుల" న్యాస తిలకం" అనే స్తోత్రానికి వ్యాఖ్యానం.

6) మీమాంసాపాదుకా పరిత్రాణమ్– పూర్వమీమాంసకులైన భాట్ట ప్రాభాకరులను నిరసిస్తూ శ్రీదేశికులు రచించిన మీమాంసపాదుకా గ్రంథానికి వ్యాఖ్యానం, ఇది .ఇందులో పూర్వోత్తర మీమాంసలకు విశిష్టాద్వైత సిద్ధాంత దృష్టిలో సమన్వయం నిరూపింపబడింది

**సంగ్రహ గ్రంథాలు**

1) రహస్య త్రయసంగ్రహం – ఇది వేదాంతదేశికుల రహస్యత్రయసారమనే అనే మణిప్రవాళ గ్రంథాన్ని అనుసరించి, దాని సారాన్ని సంస్కృతంలో తెలియజేస్తూ, సంగ్రహంగా రచింపబడిన గ్రంథం. ఇది ఆంధ్రదేశంలో ఉండే శిష్యుల సౌకర్యార్థం రచింపబడింది.

2) రహస్యత్రయసారార్థ సంగ్రహం– ఇది కూడా పై గ్రంథంవంటిదే.

పరమత నిరసన గ్రంథాలు

1) అభేద ఖండనమ్– ఇది అద్వైత మతంలోని అభేద వాదాన్ని ఖండించే గ్రంథం

2) అవిద్యా ఖండనమ్– అద్వైతులు చెప్పే అవిద్యను నిరసించే గ్రంథం,

3) ఖండన చతుష్టయమ్– ఇందులో శంకర, భాస్కర, యాదవప్రకాశ, శైవ సిద్ధాంతాలు నిరసింపబడి, విశిష్టాద్వైత సిద్ధాంతం స్థాపింపబడింది.

4) ముక్తి విచారం –ఇందులో చార్వాక సిద్ధాంతానుసారంగా చెప్పబడే మోక్షప్రకారం నిరసింపబడి భగవద్రామానుజ సంప్రదాయానుసారంగా మోక్ష స్వరూపం నిర్ణయింపబడింది.

5)ప్రపంచమిథ్యాత్వ ఖండనం – అద్వైత మతంలో చెప్పబడే "జగత్తు మిథ్య "అనే వాదాన్ని వైదిక ప్రమాణ పురస్సరంగా ఖండించే గ్రంథం.

6)సగుణ బ్రహ్మ సమర్ధనమ్– అద్వైతులు చెప్పే నిర్గుణ నిర్విశేష బ్రహ్మ వాదాన్ని నిరాకరిస్తూ, విశిష్టాద్వైత మత ప్రకారం భగవంతుడు సకల కళ్యాణ గుణాలను కలిగినవాడనే తత్వాన్ని నిరూపించే గ్రంథం,

7)శంకాశతకం– ఇది వేదాంతదేశికుల శతదూషణి గ్రంథంవంటిది. ఇతర మతాలలోని నూరు దోషాలను ప్రస్తావిస్తూ , ఆ మతాలను నిరాకరించే గ్రంథం.

8)వ్యావహారిక ఖండనం– అద్వైతులు చెప్పే వ్యవహారిక ,ప్రాతిభాసిక, పారమార్థిక సత్యత్వవాదాలను ఖండించే గ్రంథం.

**ద్రావిడ గ్రంథాలకు సంస్కృతంలో అనువాదాలు**

అభయ ప్రదాన సారం – దేశికుల అభయ ప్రదానసారానికి సంస్కృతీకరణం,

ఆహార నిర్ణయ శ్లోకాలు– దేశికుల" ఆహార నిర్ణయం"అనే గ్రంథానికి సంస్కృతానువాదం,

ప్రబంధ సారం– దేశికులు అనుగ్రహించిన ప్రబంధసారం అనే ప్రబంధంలోని ద్రావిడ పాశురాలకు సంస్కృతానువాదం

రహస్యత్రయచులకమ్– దేశికుల " రహస్యత్రయ చులకమ్" అనే ద్రావిడ గ్రంథానికి అనువాదం.

తమ పితృపాదులైన దేశికులవలె కుమార వరదాచార్య స్వామివారు కూడా ఎన్నో బిరుదులను పొందారు. నిఖిల తార్కిక చూడామణి, సర్వతంత్రస్వతంత్ర, మంత్రమహోదధి, శ్రీలక్ష్మణ యోగీంద్ర సిద్ధాంత విజయధ్వజం –అనేవి వాటిలో కొన్ని.

**వీరి ప్రధాన శిష్యులలో కొంతమంది**

శ్రీ పరకాల మఠానికి చెందిన మొట్టమొదటి యతి బ్రహ్మతంత్ర స్వతంత్ర స్వామి. – వీరు కుమారవరదాచార్యస్వామి వారి వద్దనే భగవద్విషయ కాలక్షేపాన్ని చేశారు.

ప్రతివాది భయంకరం అణ్ణన్– అణ్ణన్ వీరి వద్దనే శ్రీ భాష్య కాలక్షేపం చేశారని చెప్పబడుతున్నది. ప్రతివాది భయంకరులు అనే బిరుదును అణ్ణన్ స్వామికి కుమార వరదాచార్య స్వామివారే అనుగ్రహించారని ప్రసిద్ధి.

1) కందాడై అణ్ణన్
2) కొమాండూర్ ఆచ్చాన్
3) పిళ్ళై ప్పాక్కమ్ నాయినార్
4) తిరుమలై అప్పన్
5) కిడాంబి అప్పర్
6) నడాదూర్ ఆళ్వాన్
7) అనంతప్పన్
8) కందాడై అప్పన్
9) ఎంబెరుమానార్ అప్పన్



శ్రీకుమారవరదాచార్యవిరచితమైన

# శ్రీవేదాంతదేశికవిగ్రహధ్యానమ్

## అవతారిక

"విగ్రహాలోకనపరః తస్య చాజ్ఞాప్రతీక్షకః"(శిష్యుడు ఆచార్యుని రూపాన్ని దర్శించడంలో ఆసక్తిని కలిగి ఉండాలి, అతని ఆజ్ఞకోసం ప్రతీక్షించాలి) అనే ఆవిధంగా ఆచార్యుని దివ్యరూపం సచ్ఛిష్యుని ధ్యానానికి విషయమనేది పెద్దల సూక్తి. మందమతులమై, కాలంవల్ల వెనుకబడినవారమైన మనవంటివారుకూడా శ్రీదేశికుల దివ్యరూపాన్ని ధ్యానించడానికి వీలుగా ఉండడంకోసం శ్రీదేశికుల కుమారులైన నయనవరదాచార్యస్వామివారు ఈ వేదాంతదేశికవిగ్రహధ్యానమనే స్తుతిని అనుగ్రహించారు. దేవతలను స్తుతించేటపుడు "దేవా శ్చరణతః పునః" అనే కవిసమయానుసారంగా పాదాలనుండి ఆరంభించి రూపవర్ణనను చేయాలి." తేవు మ*ఱ్ఱ*ఱియేన్" అనే రీతిలో దేశికులను తప్ప ఇంకొక ఏ అన్యదైవాన్ని తెలియని కుమారవరదాచార్యస్వామివారు ఆ కవిసమయానుసారంగానే దేశికుల దివ్యమంగళరూపాన్ని 15 శ్లోకాలతో పాదాలనుండి ఆరంభించి వర్ణించారు.

మొదట దేశికుల రూపంలోని సముదాయశోభను, చివరలో అన్ని అంగాలను కలిపి ఒక శ్లోకంలోను వర్ణించి, తమ మనసులో సదా ఆ ఆచార్యుల దివ్యరూపం స్థిరంగా వేంచేసి ఉండాలని వరదాచార్యులవారు ప్రార్థించారు.

శ్రీవేదాంతదేశికుల దివ్యరూపాన్ని ఈ స్తోత్రంద్వారా మన కంటిముందు సాక్షాత్కరింపజేస్తున్నారు నయనవరదాచార్యస్వామివారు. దేశికుల దివ్యరూపాన్ని గాఢంగా అవగాహించి, ఆ అనుభవాన్ని ఈ స్తుతిరూపంలో నయనవరదులు పలుకుతున్నారు-అనే విషయం మనకు ఈ స్తుతిని గమనిస్తే తెలుస్తుంది. దేశికుల కాలంలోనే జీవించి, వారి దివ్యమంగళవిగ్రహాన్ని సాక్షాత్తు దర్శించే భాగ్యాన్ని పొందలేని మనం ఆ అనుభవంకోసం బాధపడనక్కరలేదు. ఎందుకంటే, దేశికులే స్వయంగా నిర్మించిన వారి విగ్రహాన్ని ఈనాటికీ మనం తిరువహీంద్రపురంలో దర్శించవచ్చు.

ఇంతేకాక, పలు దివ్యదేశాలలో దేశికుల అర్చామూర్తిని వారి కుమారులు నయనవరదులు ప్రతిష్ఠించారు కూడా. పిళ్ళై అన్దాది ప్రబంధంలోని "తొణ్డరుకక్కుమ్" అనే పాశురంలో వరదాచార్యస్వామి దేశికుల దివ్యసౌందర్యాన్ని అద్భుతంగా వర్ణించారు. "వడవ*ழ*కార్న్ద వణ్ తూప్పుల్ వళ్ళల్" అని దేశికుల రూపం దివ్యసౌందర్యసమృద్ధమని అన్నారుకూడా. ఈ స్తుతిని అనుసంధిస్తే మన కంటిముందు దేశికుల దివ్యమంగళరూపం ప్రత్యక్షమవుతుంది. ఇటువంటి అద్భుతమైన స్తోత్రాన్ని అనుగ్రహించిన నయనవరదులకు మనమందరం చాలా కృతజ్ఞులమై ఉన్నాము.

**శ్రీమాన్ వేంకటనాథార్యః కవితార్కికకేసరీ,**
**వేదాంతాచార్యవర్యో మే సన్నిధత్తాం సదా హృది.**

కవులకు, తార్కికులకు సింహంవంటివారు, వేదాంతాచార్యులనే బిరుదాన్ని కలవారైన, వేంకటనాథులనే పేరును కల వేదాంతదేశికులు నా హృదయంలో సదా వేంచేసి ఉండాలి.

<u>శ్రీకుమారవరదాచార్యస్వామి తనియన్ శ్లోకం:</u>

**శ్రీమల్లక్ష్మణయోగీంద్ర సిద్ధాంతవిజయధ్వజమ్,**
**విశ్వామిత్రకులోద్భూతం వరదార్య మహం భజే.**

భగవద్రామానుజుల దర్శనానికి విజయధ్వజంవంటివారు, విశ్వామిత్రకులంలో జన్మించినవారైన నయనవరదాచార్యులవారిని నేను సేవిస్తున్నాను.

**శ్రీమతే రామానుజాయ నమః**

**శ్రీమతే నిగమాంతమహాదేశికాయ నమః**

## శ్రీకుమారవరదాచార్యవిరచితమైన

# శ్రీవేదాంతదేశికవిగ్రహధ్యానమ్

1) **మనఃప్రసూనస్తబకం మదీయం**
**నాథస్య కౌతూహలమాతనోతు,**
**బిభర్తి యో భాగవతేషు సర్వ**
**తంత్రస్వతంత్రేషు చ పారతంత్ర్యమ్.**

తాము సర్వతంత్రస్వతంత్రులైనా, భగవద్భక్తుల విషయంలో పరతంత్రులైన నా నాథులు వేంకటనాథుల విషయంలో నా మనస్సు అనే పూలగుత్తి ఆనందాన్ని పొందాలి.

శ్రీదేశికుల కరుణ చాలా గొప్పది. భక్తులు తమ మనస్సులలోని కోరికలను వారు వ్యక్తం చేయకపోయినా అది వాటిని గ్రహించగలదు. దానికి ఉదాహరణం కందాడై లక్ష్మణాచార్యుల చరిత్ర. చంద్రుని చల్లని కిరణాలు లోకంలోనివారి దేహతాపాన్ని తీర్చేటట్లు, వారి కరుణ భక్తులమనస్సులలోని తాపాన్ని పోగొడుతుంది. శ్రీరంగనాయకి వారికి సర్వతంత్రస్వతంత్రులనే బిరుదును ఇచ్చింది. దానికి తగినట్లు దేశికులు పలు అపూర్వకృత్యాలను చేశారు. అవి అన్నీ వారి దివ్యచరిత్రలో స్పష్టం. ఆ రీతిలోనే దేశికులు తమ భక్తుల మనోరథాలను తీర్చడానికికూడా ఎన్నో అద్భుతలీలలను ప్రదర్శించారు. అటువంటి దేశికుల శ్రీపాదసన్నిధిలో నయనవరదులు తమ మనస్సు అనే పుష్పగుచ్ఛాన్ని సమర్పిస్తున్నారు.

2) **శ్రీవాదిహంసాంబుదదేశికేంద్ర**
**పాదాంబుజద్వంద్వపరాగదైవమ్,**
**శ్రీవేంకటేశం గురుసార్వభౌమం**
**చేతశ్చిరం భావయ సౌమ్యరూపమ్.**

కిడాంబి అప్పుళ్ళార్ అనే ఆత్రేయ రామానుజాచార్యస్వామివారి

శ్రీచరణపద్మయుగాన్ని దైవంగా కల వారు, అందమైన రూపాన్ని కలవారైన శ్రీవేంకటేశు లనే ఆచార్యసార్వభౌములను, ఓ మనసా! సదా ధ్యానించు.

అత్రేయ రామానుజాచార్యులవారు (క్రీ .శ. 1220-1310) వేదాంతదేశికులకు మేనమామ. వీరికి అప్పుళ్ళార్, వాదిహంసాంబుదాచార్యులనే పేర్లుకూడా ఉన్నవి. అప్పుళ్ళార్ ఆచార్యులు నడాదూర్ అమ్మాళ్ అనే పేరుతో ప్రసిద్ధులైన వాత్స్యవరదగురువు. శ్రుతప్రకాశికాచార్యులవారనే సుదర్శనసూరి, అప్పుళ్ళార్? అనే ఈ ఇద్దరు సబ్రహ్మచారులు. నడాదూర్ అమ్మాళ్ కంచిలో వరదరాజస్వామి కోవెలలో అనుగ్రహించిన శ్రీభాష్యకాలక్షేపార్థాలను సుదర్శనసూరి శ్రుతప్రకాశికా అనే పేరుతో గ్రంథస్థం చేశారు. అది ఈనాటికీ శ్రీభాష్యానికి సాటి అయిన గొప్ప వివరణంగా పేరుపడింది.''**నమో రామానుజార్యాయ వేదాంతార్థప్రదాయినే, ఆత్రేయపద్మనాభార్యసుతాయ గుణశాలినే"** అనేది అప్పుళ్ళార్ తనియన్ శ్లోకం.

వేదాంత దేశికులు అవతరించిన సమయానికి అప్పుళ్ళార్ కు 48 సంవత్సరాలు. దేశికులు చాలా చిన్న వయస్సులో ఉండేటపుడు ఒకనాడు అప్పుళ్ళార్ వారిని తీసికొని అమ్మాళ్ శ్రీభాష్యకాలక్షేపానికి వెళ్ళారు. అప్పుడు అమ్మాళ్ దేశికుల ముఖంలోని దివ్యతేజాన్ని చూచి, ఆశ్చర్యపడి "ఈ బాలుడు భవిష్యత్తులో గొప్ప పండితుడై, ప్రసిద్ధ సంప్రదాయప్రవర్తకుడవుతాడు" అని ఆశీర్వదించారు. దేశికులను తగిన రీతిలో తీర్చిదిద్దమని కూడా అమ్మాళ్ అప్పుళ్ళార్ ను ఆదేశించారు. ఆ విధంగానే అప్పుళ్ళార్ వద్ద సమస్తశాస్త్రాలను, ఉభయవేదాంతాలను ఇరవై ఏండ్లు నిండడానికి ముందే అభ్యసించి, సాటి లేని విద్వాంసులయ్యారు. ఈ విషయాన్ని దేశికులే స్వయంగా "వింశత్యబ్దే విశ్రుతనానావిద్యః" అనే సూక్తిద్వారా తెలిపారు.

3) **శ్రీమత్త్రయీశేఖరదేశికస్య**
**శ్రీవేంకటేశస్య వపుర్మనోజ్ఞమ్,**
**ఆదిత్యవర్ణం విశదం మమాక్ష్ణోః**
**ఆపాదచూడాపద మావిరస్తు.**

వేదాంతదేశికులనే వేంకటేశగురువుల, సూర్యుని వర్ణంవంటివర్ణాన్ని కల అందమైన దివ్యరూపం పాదాలనుండి శిరస్సువరకు నా కంటిముందు సాక్షాత్కరించాలి.

దేశికులుకూడా భగవద్ధ్యానసోపానమనే స్తోత్రంలో శ్రీరంగనాథుని దివ్యరూపవర్ణనను పాదాదికేశాంతంగా చేశారు. ఆ క్రమాన్ని అనుసరిస్తూ నయనవరదాచార్యస్వామివారు దేశికుల విగ్రహవర్ణనను పాదాదికేశాంతంగానే

చేస్తున్నారు.

4)　**నిర్ణిద్రపంకేరుహయుగ్మశోభా**
**నిరాకృతిప్రౌఢపదాబ్జయుగ్మమ్,**
**నీరంధ్రనిర్యన్నఖచంద్రచంద్రా**
**తపస్ఫుటద్ధ్యాతృహృదంధకారమ్.**

దేశికులు వికసించిన రెండు తామరపూల అందాన్ని జయించే అతిశయాన్నికల రెండు శ్రీచరణాలను కలవారు. ఆ పాదాలలోని చంద్రునివంటి నఖాలనుండి నిరంతరం స్రవించే వెన్నెలవంటి ప్రకాశంతో తమను ధ్యానించేవారి హృదయతాపాన్ని ఆ దేశికులు పోగొడుతున్నారు.

ఈ శ్లోకంలో కుమారవరదాచార్యస్వామివారు దేశికులవారి రెండు శ్రీచరణాలను, ఆ చరణాల నఖాలనుండి ప్రవహించే కాంతులను వర్ణిస్తున్నారు. దేశికుల పాదపద్మాల శోభ ఏసమయంలోను ముడుచుకోని-నిద్ర ఎరుగని-తామరపూలవంటివి "నిర్ణిద్రపంకేరుహమ్"అని అంటున్నారు. లోకంలో తామరపూలు నిద్రనుండి లేచినట్లుగా సూర్యకిరణస్పర్శతో వికసిస్తాయి. సూర్యుడస్తమించినపుడు అవి నిద్రను పొందినట్లు ముడుచుకొంటాయి. ఇక్కడ కుమారవరదాచార్యస్వామివారు దేశికుల శిష్యుల హృదయాలలో ఉత్తేజాన్ని కలిగించడంకోసం రెండు చరణాల కాంతిని ఎల్లప్పుడు వికసించి ఉండే, ప్రకాశించే రెండు తామరపూలతో పోలుస్తున్నారు. ఆవిధంగానే, దేశికుల పాదాలలోని నఖాల కాంతిని వర్ణిస్తూ, ఆ కాంతి శిష్యుల మనసులలోని అజ్ఞానమనే అంధకారాన్ని పోగొడుతున్నదని అన్నారు.

దేశికులుకూడా ఈ విధంగానే **"దేవనాయకపంచాశత్"** అనే స్తుతిలో **"త్వదీయపాదయోరసౌ నఖరత్నపంక్తిః మహాతరంగైః మమ పంకాని నిహంతి"** అని అనడం ఇక్కడ స్మరణీయం.

5)　**నిజార్ధచంద్రోపమితాలకోద్య**
**న్నిరంతరోద్భాసిసితోర్ధ్వపుండ్రమ్,**
**సితాయతస్వచ్ఛశిరోజబంధం**
**మునేః శఠారేరివ మూర్తిభేదమ్.**

దేశికుల ముఖంలోని దివ్యమైన ముంగురుల పంక్తి రాత్రివలె నల్లగా

భాసిస్తున్నది. అష్టమీతిథినాటి చంద్రునివలె భాసించే ఫాలభాగంలో తెల్లగా స్వచ్ఛంగా వెలిగే ఊర్ధ్వపుండ్రాన్ని కలవారు. నల్లని, దీర్ఘమైన కేశబంధాన్ని కలవారు. అందువల్ల శఠకోపుల వేరొక రూపమా! అనే రీతిలో ఉన్నారు.

కుమారవరదాచార్యస్వామివారు దేశికుల పాదనఖకాంతిని సేవిస్తూ ఉండగా, ఆ నఖకాంతులు దేశికుల ముఖమండలాన్ని, ఫాలభాగాన్ని ప్రకాశింపజేశాయి. అపుడు వారి మనస్సులో కలిగిన భావానికి నమ్మాళ్వారులు తిరువాయ్ మొ*ழி* ప్రబంధంలో పలికిన ఒక సూక్తి దోహదమై ఉండవచ్చు. నమ్మాళ్వారులు తిరుమాలిరుమ్ శోలై దివ్యదేశంలోని సుందరబాహుస్వామి సౌందర్యాన్ని సేవించి, **"ముడిచ్చోదియాయ్ ఉనదు ముకచ్చోది మలర్ న్దదువో!"** ఇత్యాదిగా ఆ స్వామిని ప్రశ్నించారు. "ఓ శ్రియః పతీ! నీ ముఖకాంతి కిరీటకాంతివలె భాసిస్తున్నదా? లేక, కిరీటకాంతి ముఖకాంతిగా భాసిస్తున్నదా? నీ పాదాల కాంతి నీవు నిలచిన ఆసనపద్మంగా తోస్తున్నదా? లేక, ఆసనపద్మకాంతి పాదాలుగా తోస్తున్నదా? విస్తృతమైన అందాన్ని కల నీ కటికాంతి సహజమైన కాంతిని పీతాంబరం కల పీతాంబరంతోపాటు పలు దివ్యాభరణాలుగా కిందకు ప్రసరించిందా? లేక, నీ పీతాంబరశోభ, దివ్యాభరణాల కాంతి నీ కటికాంతిగా ప్రకాశిస్తున్నదా?"-అనేది ఆ పాశురంలోని భావం. కుమారవరదాచార్యస్వామివారుకూడా ఇక్కడ దేశికుల ఫాలంలోని దివ్యాలకసమూహాన్ని రాత్రిగా, ఫాలాన్ని అష్టమీచంద్రునిగా సంభావించి పలికారు.

దేవనాయకస్వామి ఊర్ధ్వపుండ్రాన్ని దేశికులు వర్ణించేటపుడు **"ఘనాభే లావణ్యవర్షిణి లలాటతటే తటిద్గుణవిశేషమివ ఊర్ధ్వపుండ్రం బిభ్రత్, తమసావృతస్య విశ్వస్య మాంగలికప్రదీపం విభావయసి మన్యే"(దేవనాయక పంచాశత్-20)** (వర్షాకాలమేఘంవంటి నల్లని నీ లలాటంలో మెరుపువలె వెలిగే ఊర్ధ్వపుండ్రం సంసారుల అజ్ఞానమనే చీకటిని పోగొట్టే మంగళదీపంవలె భాసిస్తున్నది) అని అనడం ఇక్కడ స్మరణీయం.

ఈ శ్లోకంలో నయనవరదులు శ్రీదేశికుల ముఖంలోని నల్లని అలకభారాన్ని, ఊర్ధ్వపుండ్రభూషితమైన ఫాలభాగాన్ని స్తుతించడమే కాక, దేశికులను నమ్మా*ழ*్వారులుగా సంభావించారు.

**6) ముఖేంద్వధఃపాతి కరోత్కరాకృతి**

**స్ఫుటచ్ఛవిశ్మశ్రుపరిష్కృతోరసమ్,**

**సితోపవీతం తులసీసరోరుహా-**

**క్షమాలికాలంకృతచారుకంధరమ్.**

దేశికుల ముఖమనే చంద్రునినుండి కిందకు వ్యాపించే కిరణాలు తెల్లని మీసం(గెడ్డం)వలె భాసిస్తున్నాయి. దానివల్ల దేశికుల వక్షఃస్థలం గొప్పగా వెలుగుతున్నది. ఆ విధంగానే, తెల్లనియజ్ఞోపవీతం, తులసితామరపూల మాలికలతోవారి కంఠం అలంకరింపబడింది.

ఇందులో దేశికుల వక్షస్సును భూషించే తెల్లని గెడ్డం, తామరతులసిపూసల మాలికలు వర్ణింపబడుతున్నాయి. ముందుశ్లోకాన్ని వివరించేటపుడు ప్రస్తావించిన తిరువాయ్‌మొ*ళి*పాశురంలో నమ్మాళ్వారులు సంభావించినట్లు ఇక్కడ, నయనవరదాచార్యులవారు దేశికుల వక్షఃస్థలంలో వెలిగే తెల్లని గడ్డాన్ని వారి ముఖమనే చంద్రునినుండి కిందకు ప్రసరించే తెల్లని కిరణాల సమూహంగా ఉత్ప్రేక్షించారు. తులసితామరపూసల మాలికలను ధరించడం శ్రీవైష్ణవలక్షణం. మణవాళ మహామునుల వా*ళి* తిరునామంలోని “ముప్పురినూల్ మణివడముమ్ ముక్కోల్ దరిత్తాన్ వా*ళి*యే” అనే సూక్తి స్మరణీయం.

7 ) **అనంగసౌవర్ణనిషంగకాంతి**

**ప్రసంగభంగావహచారుజంఘమ్,**

**లసత్ కకుద్మత్కకుదాభిరూప్య**

**నితాంతనిర్భాసితజానుయుగ్మమ్.**

దేశికుల కాలి పిక్కలు మన్మథుని, బంగారు అంబులపొదికి కల అందాన్ని మించిన అందాన్ని కలిగినవి. ఎద్దుల మూపురాలవంటి రెండు ముంగాళ్ళను వారు కలిగి ఉన్నారు.

కుమారవరదాచార్యస్వామివారు ఈ స్తుతిని దేశికుల శ్రీచరణాలను స్తుతించడంతో ఆరంభించారు. పైకి ప్రసరించిన దేశికుల పాదనఖకాంతులు వారిని పైకి ఆకర్షించి, దేశికుల ముఖాన్ని,ఫాలాన్ని సేవించేటట్లు చేశాయి. అందువల్ల క్రమం మారి మధ్యలో ముఖాన్ని, ఫాలాన్ని, వక్షస్సును దర్శించి, వానిని స్తుతించారు. ఇపుడు మళ్ళీ క్రమానుసారంగా పాదాలవద్దకు వచ్చిన వరదాచార్యులవారికి దేశికుల పిక్కల, ముంగాళ్ళ దర్శనం కలుగగా, వాటిని ఈ శ్లోకంలో స్తుతిస్తున్నారు.

8 ) **రమ్యావరస్తంభవిజృంభమాణ**

**దుర్వర్ణసర్వంకషసక్థిదృశ్యమ్,**
**కటీతటశ్లిష్టపవిత్రశుభ్రాం-**
**తరీయనిర్భాసినితంబబింబమ్.**

మిక్కిలి అందమైన అరటి బోదెల విజృంభించే వ్యర్థమైన గర్వాన్ని పూర్తిగా నశింపజేసే ఊరువులతో దేశికులు అందంగా వేంచేసి ఉన్నారు. నడుములో ధరించిన తెల్లని వస్త్రంతో వారి గుండ్రని నితంబాలు(పిరుదులు) రెండు ప్రకాశిస్తున్నాయి.

ఇపుడు కుమారవరదాచార్యుల వారి ఆచార్య దివ్యమంగళవిగ్రహధ్యానం మోకాళ్ళ నుండి పైకి పోయి, ఊరువులను, నితంబభాగాన్ని(పిరుదులను), ఆ భాగాలను అలంకరించే తెల్లని, అందమైన వస్త్రాన్ని చేరింది. పరస్పరం సామ్యాన్ని కల బలిష్ఠమైన దేశికుల ఊరువులు రెండు అరటి బోదెల వ్యర్థగర్వాన్ని అణచి వేశాయి?అనే ఈ నయనవరదుల సూక్తి శ్రీదేశికుల **భగవద్ధ్యానసోపానస్తోత్రం**లోని **"కామారామస్థిరకదళికాస్తంభసంభావనీయమ్"**(శ్రీరంగనాథుని ఊరువులు మన్మథుని ఉద్యానవనంలోని అరటిచెట్ల బోదెలవంటివి) అనే సూక్తిని తలపిస్తుంది. అంతేకాక, ఆ శ్రీరంగనాథుని ఊరువులను ఆవరించి అలంకరించే పీతాంబరాన్ని **"క్షౌమాశ్లిష్టమ్"** అని కీర్తించినట్లే ఇక్కడ నయనవరదులు కూడా దేశికుల ఊరువులను అలంకరించే తెల్లని వస్త్రాన్ని శ్లోకంలోని ఉత్తరార్ధంలో "కటీతట" ఇత్యాదిగా వర్ణించారు.

**9) ఆవర్తగర్తోజ్జ్వలనాభిచక్రమ్**
**అత్యాయతోరఃస్థలదీవ్యమానమ్**
**ఆజానులంబ్యాయతవృత్తబాహుమ్**
**అత్యున్నతాంసం శ్రితగూఢజత్రుమ్.**

శ్రీదేశికులు నీటిసుడివంటి లోతైన నాభిని కలిగినవారు. చాలా విశాలమైన వక్షఃస్థలాన్ని కలవారు. మోకాళ్ళవరకు వేలాడే, గుండ్రని, బలిష్ఠమైన బాహువులను కలవారు ఎత్తైన బాహుసంధులను, మూపురాలను కలవారు.

దేశికుల దివ్యరూపంలో భాసించే పలు ఉత్తమసాముద్రికలక్షణాలను నయనవరదులు ఈ స్తుతిలో ప్రస్తావిస్తున్నారు. లోతైన బొడ్డు, విశాలమైన, బలిష్ఠమైన వక్షఃస్థలం, మోకాళ్ళవరకు సాగి ఉండే పొడుగైన బాహువులు, బలిష్ఠమైన బాహుసంధులు, ఎత్తైన మూపురాలు-అనే ఈ ఉత్తమపురుష లక్షణాలను నయనవరదులు ఇందులో ప్రస్తావించారు.

నాభిని లోతైన నీటిసుడితో పోల్చడం కవిసమయం. దేశికులు భగవద్ధ్యానసోపానంలో శ్రీరంగనాథుని నాభిని “రమ్యావర్తద్యుతిసహచరీ నాభిః”(అందమైన, నీటిసుడివంటి నాభి) అని సుడితో పోల్చారు . ఈ పోలిక గుండ్రంగా ఉండడం, లోతుగా ఉండడం మొదలైన సామ్యాలవల్ల సిద్ధిస్తుంది.

10) **శంఖప్రతిస్పర్ధిసుజాతకంఠం**
**శాంతోపమానాయితకర్ణపాశమ్,**
**సుస్నిగ్ధబద్ధస్మితచూతపోత–**
**నవ్యప్రవాళోపమితాధరోష్ఠమ్.**

శ్రీదేశికులు శంఖంకంటే అందమైన కంఠాన్ని కలవారు. సాటి లేని కర్ణాలను కలవారు. చక్కగా పెరిగిన కొత్త మామిడి చిగురువంటి ఎర్రని పెదవులనుండి వెలువడే, వాత్సల్యంతో కూడిన మందహాసాన్ని కలవారు.

నయనవరదుల ఈ వర్ణన దేశికుల భగవద్ధ్యానసోపానంలోని **“సాభిప్రాయస్మితవికసితం చారుబింబాధరోష్ఠమ్”**(శ్రీరంగనాథుని ముఖం అనురాగంతోకూడిన చిరునవ్వుతో వికసించినది, అందమైన దొండపండువంటి కింద పెదవిని కలిగినది) అనే సూక్తిని తలపిస్తుంది.

11) **సునిర్మలోదంచితమౌక్తికాలీ**
**జడీకృతప్రౌఢిమదంతపంక్తిమ్.**
**వికాసినాసాపుటకాంతిశాంత**
**ప్రఫుల్లతిల్యప్రసవావలేపమ్.**

శ్రీదేశికులు నిర్మలమైన ముత్యాల వరుసను జయించే దంతాల వరుసను కలవారు, వికసించిన నూగుపూవు గర్వాన్ని లేకుండా చేసే నాసికను కలవారు.

కుమారవరదాచార్యులవారి ధ్యానం ఇపుడు దేశికుల దంతపంక్తిలోను, నాసికాసౌందర్యంలోను మగ్నమైనది. ఇక్కడ చెప్పబడిన ఉపమానాలు కవిసమయప్రసిద్ధాలు.

12) **నాసాలసత్కల్పలతాప్రసూన**
**యుగాయితాంభోరుహచారునేత్రమ్,**
**తత్సౌరభాఘ్రాణవినిశ్చలాలి–**

**ద్వయోపమభ్రూయుగళాభిరామమ్.**

శ్రీదేశికుల నాసికను దర్శిస్తే అది కల్పలత మళ్ళీ పుట్టినట్లు కన్పిస్తుంది. వారి అందమైన రెండు కన్నులు తామరపూలవలె ఉన్నాయి. వారి కనుబొమలను రెండిటిని చూస్తే, నేత్రాలనే తామరపూలలోని సుగంధాన్ని ఆఘ్రాణించడంకోసం వచ్చి, నిశ్చలంగా నిలచిన తుమ్మెదల వరుసలవలె ఉన్నవి.

**13) సుజాతచరణాంబుజం సుదృఢగుల్ఫజానూరుకమ్**
**సితాంతరకటీతటం సుభగనాభివక్షోగళమ్,**
**సుదీర్ఘయుగబాహుకం శుభకపోలనాసాక్షికం**
**మనోరుచిరమాలికం కలయ వేంకటేశం గురుమ్.**

తామరలవంటి అందమైన శ్రీచరణాలను, దృఢమైన పిక్కలను, ముంగాళ్ళను, ఊరువులను, తెల్లని వస్త్రంతో అలంకరింపబడిన నడుమును, అందమైన నాభిని, వక్షస్సును, కంఠాన్ని, చాలా పొడుగైన బాహువులను, అందమైన చెవులను, కన్నులను, మనస్సును ఆకర్షించే అందమైన తామరతులసిపూసల మాలికలను కల, వేంకటేశు లనే పేరు కల వేదాంతదేశికులను ఓమనసా! ధ్యానించు.

దేశికులు భగవద్ధ్యానసోపానాన్ని శ్రీరంగనాథుని అన్ని దివ్యాంగాల వర్ణనతో ముగించినట్లే నయనవరదులుకూడా దేశికుల దివ్యమంగళరూపంలోని అన్ని దివ్యావయవాల స్తుతితో ముగిస్తున్నారు. ఇక్కడకూడా పాదాదికేశాంతక్రమాన్ని అనుసరించడం విశేషం. దేశికుల స్తుతి ప్రథమపర్వాత్మకం, ఇది చరమపర్వాత్మకం.

**14) రథాంగజలజాంకితః సులలితోర్ధ్వపుండ్రోజ్జ్వలః**
**సరోజతులసీమణిగ్రథితమాలికాభూషణః,**
**సితాంశుకయుగాంచితః స్మితముఖో దయాశీతలః**
**చకాస్తు హృది మే సదా గురుర్వేంకటాధీశ్వరః**

శంఖచక్రలాంఛనాలను కలవారు, అందమైన ఊర్ధ్వపుండ్రాలతో వెలిగేవారు, తులసి, తామరపూసల మాలికలతో అలంకరింపబడినవారు, తెల్లని ధోవతిని, ఉ త్తరీయాన్ని ధరించినవారు, చిరునవ్వుతో భాసించే ముఖాన్ని కలవారు. చల్లని దయ కలవారైన వేంకటేశులనే ఆచార్యులు నా హృదయంలో సదా ప్రకాశించాలి.

ఇది ఈ స్తుతిలోని ధ్యానశ్లోకం. ఈ శ్లోకంద్వారా నయనవరదులు దేశికుల

దివ్యరూపాన్ని మన కంటిముందు సాక్షాత్కరింపజేస్తున్నారు.

**15) య ఇమాం దినచర్యాం చ విగ్రహధ్యానపద్ధతిమ్,**
**వరదార్యకృతాం భక్త్యా శీలయేన్ముక్త ఏవ సః.**

కుమారవరదాచార్యులవారిచే రచింపబడిన దినచర్య, వేదాంతదేశికవిగ్రహధ్యానమనే స్తుతులను భక్తితో అనుసంధించేవాడు ఈ విభూతిలోనే ముక్తుడవుతాడు.

ఇది ఫలశ్రుతిశ్లోకం. దివ్యసూరుల ప్రబంధాలలో ప్రతిదశకం చివర ఫలశ్రుతిపాశురం చెప్పబడినట్లే ఇక్కడకూడా ఫలశ్రుతి తెలుపబడింది. ఈవిధంగా ఫలాన్ని నిర్దేశిస్తూ పలుకడం వైదికక్రమం. **"జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత"** అని అంటూ జ్యోతిష్టోమయాగం చేస్తే స్వర్గం లభిస్తుందని వేదవాక్యం తెలుపుతున్నదికదా!

**కవితార్కికసింహాయ కల్యాణగుణశాలినే,**
**శ్రీమతే వేంకటేశాయ వేదాంతగురవే నమః.**

**వాదద్విపశిరోభంగపంచాననపరాక్రమః,**
**శ్రీమాన్ వేంకటనాథార్యః చిరం విజయతాం భువి.**

卐卐卐卐卐

**శ్రీమతే రామానుజాయ నమః**

**శ్రీమతే నిగమాంత మహాదేశికాయ నమః**

శ్రీకుమారవరదాచార్యవిరచితమైన

# శ్రీమద్వేదాంతదేశికమంగళమ్

**శ్రీమల్లక్ష్మణయోగీంద్రసిద్ధాంతవిజయధ్వజమ్,**
**విశ్వామిత్రకులోద్భూతం వరదార్యమహం భజే.**

భగవద్రామానుజసిద్ధాంతమైన విశిష్టాద్వైతానికి విజయధ్వజంవంటివారు, విశ్వామిత్రకులంలో ఉద్భవించినవారైన వరదాచార్యులవారిని భజిస్తున్నాను.

1) **సర్వతంత్రస్వతంత్రాయ సింహాయ కవివాదినామ్,**
**వేదాంతాచార్యవర్యాయ వేంకటేశాయ మంగళమ్.**

సర్వశాస్త్రాలలో సమర్థులు, కవులలో తార్కికులలో సింహంవంటివారు, వేదాంతాచార్యులనే బిరుదును కలవారైన వేదాంతదేశికులకు మంగళం.

2) **నభస్యమాసి శ్రోణాయా మవతీర్ణాయ సూరయే,**
**విశ్వామిత్రాన్వయాయాస్తు వేంకటేశాయ మంగళమ్.**

భాద్రపదమాసంలోని శ్రవణానక్షత్రంలో అవతరించినవారు, పండితులు, విశ్వామిత్రకులంలో అవతరించినవారైన వేదాంతదేశికులకు మంగళం.

3) **పితా యస్యానంతసూరిః పుండరీకాక్షయజ్వనః,**
**పౌత్రో యస్తనయ స్తోతారాంబాయా స్తస్య మంగళమ్.**

అనంతసూరికి పుత్రులు, పుండరీకాక్షయజ్వకు పౌత్రులు, తోతారాంబకు కుమారులైన వేదాంతదేశికులకు మంగళం.

4) **వేంకటేశావతారోయం తద్ఘంటాంశోఽథవా భవేత్,**
**యతీంద్రాంశోఽథవేత్యేవం వితర్క్యాయాస్తు మంగళమ్.**

"ఈ మహనీయులు వేంకటేశ్వరుని అవతారమా? లేక, ఆ స్వామి కోవెలలోని ఘంటయొక్క అంశతో అవతరించారా? లేక, భగవద్రామానుజుల అవతారమా?" అని ఊహించదగినవారై ఉండే వేదాంతదేశికులకు మంగళం.

**5 ) శ్రీభాష్యకారః పంథాన మాత్మనా దర్శితం పునః.,**
**ఉత్తుంగమాగతో నూన మిత్యుక్తాయాస్తు మంగళం.**

తనచే చూపింపబడిన సన్మార్గాన్ని మళ్ళీ తిరిగి ఉద్ధరించడంకోసం శ్రీభాష్యకారులు తిరిగి వేంచేశారు. ఇది నిశ్చయం ?అని పెద్దలచే స్తుతింబడే దేశికులకు మంగళం కలగాలి.

**6 ) యో బాల్యే వరదార్యాయ ప్రాచార్యస్య పరాం దయామ్,**
**అవాప్య వృద్ధిం గమితః తస్మై యోగ్యాయ మంగళం.**

బాల్యంలో తమకు ప్రాచార్యులైన నడాదూర్ అమ్మాళ్ అనే వాత్స్యవరదుల గొప్ప దయను పొంది, తత్కారణంగా వృద్ధి చెందినవారైన వేదాంత దేశికులకు మంగళం.

**7 ) రామానుజార్యాదాత్రేయాత్ మాతులాత్ సకలాః కలాః**
**అవాప వింశత్యబ్దే యస్తస్మై ప్రాజ్ఞాయ మంగళమ్.**

తమకు మేనమామ అయిన ఆత్రేయ రామానుజాచార్యులవారి సన్నిధిలో తమకు ఇరవై సంవత్సరాల వయస్సు నిండడానికి ముందే అన్ని శాస్త్రాలను అభ్యసించిన, ప్రాజ్ఞులైన వేదాంతదేశికులకు మంగళం.

**8 ) శ్రుతప్రకాశికా భూమౌ యేనాదౌ పరిరక్షితా,**
**ప్రవర్తితా చ పాత్రేషు తస్మై శ్రేష్ఠాయ మంగళమ్**

మొట్టమొదట, శ్రీభాష్యవాఖ్యానమైన శ్రుతప్రకాశికను రక్షించి, దానిని యోగ్యత కలవారికి ఉపదేశించినవారైన, గొప్పవారైన వేదాంతదేశికులకు మంగళం.

**9 ) సంస్కృతీభి ర్ద్రావిడీభిః బహ్వీభిః కృతిభిర్జనాన్,**
**యః సముజ్జీవయామాస తస్మై సేవ్యాయ మంగళమ్.**

సంస్కృతంలో, ద్రావిడంలో తాము అనుగ్రహించిన పలు గ్రంథాలతో లోకాన్ని తరింపజేసినవారు, సేవించదగినవారైన వేదాంతదేశికులకు మంగళం.

**10) యః ఖ్యాతిలాభపూజాసు విముఖో వైష్ణవే జనే,**
**క్రయణీయదశాం ప్రాప్తః తస్మై సేవ్యాయ మంగళమ్.**

కీర్తి, ధనలాభం, ఇతరులు తమను పూజించాలనే అభిప్రాయం?అనే వీటిలో విముఖులు, భగవద్భక్తుల విషయంలో వారు తమ ఇష్టానుసారంగా తమను అమ్మే రీతిలో వారికి స్వాధీనమై ఉండేవారు, ఇటువంటి సద్గుణాలను కలిగి ఉన్నందువల్ల ఆదరణీయులైన వేదాంతదేశికులకు మంగళం.

**11) యస్మాదేవ మయా సర్వం శాస్త్రమగ్రాహి నాన్యతః,**
**తస్మై వేంకటనాథాయ మమ నాథాయ మంగళమ్.**

నేను అన్ని శాస్త్రాలను వేదాంతదేశికులవల్లనే గ్రహించాను. వేరెవ్వరివద్ద కాదు. అటువంటివారు, వేంకటనాథులనే పేరును కలవారు, నాకు స్వామి అయిన వేదాంతదేశికులకు మంగళం.

**12) పిత్రే బ్రహ్మోపదేష్ట్రే చ గురవే దైవతాయ చ,**
**ప్రాప్యాయ ప్రాపకాయాస్తు వేంకటేశాయ మంగళమ్.**

నాకు తండ్రి, బ్రహ్మోపదేశం(గాయత్రీమంత్రోపదేశం) చేసిన గురువు, పంచసంస్కారాలను చేసిన ఆచార్యులు, పరదైవం, ప్రాప్యం, ఉపాయం అయిన వేదాంతదేశికులకు మంగళం.

**13) యః కృతం వరదార్యేణ వేదాంతాచార్య మంగళమ్,**
**ఆశాస్తేఽనుదినం సోఽపి భవేన్మంగళభాజనమ్.**

శ్రీనయనవరదాచార్యులవారు అనుగ్రహించిన ఈ వేదాంతదేశికుల మంగళాశాసనస్తుతిని ఎవడు ప్రతిదినం అనుసంధిస్తాడో, అతడు కూడా మంగళాన్ని పొందాలి.

**శ్రీవేదాంతదేశికమంగళం సంపూర్ణమ్.**

卐卐卐卐卐



**ప్రతివాది అణ్ణన్ స్వామి, కాంచీపురం**

**శ్రీమతే రామానుజాయ నమః**

**శ్రీమతే నిగమాంత మహాదేశికాయ నమః**

ప్రతివాది భయంకరమ్ అణ్ణన్ అనుగ్రహించిన

# సప్తతిరత్నమాలికా

## అవతారిక

శ్రీకుమార వరదాచార్యస్వామివారు(క్రీ.శ. 1316-1415) వేదాంతదేశికుల కుమారులు. వీరికే నయనవరదాచార్యస్వామి అనికూడా పేరు. వీరి శిష్యులలో హస్తిగిరినాథులనే గొప్ప విద్వాంసులు ఒకరు. వీరికే ప్రతివాది భయంకరం అణ్ణన్ అని పేరు. వీరిది ముదుంబై వంశం. వీరు తిరుమలలో శ్రీవేంకటేశ్వరునకు కైంకర్యం చేస్తూ ఉండగా, ఒక శ్రీవైష్ణవులు తిరుమలకు వచ్చి ప్రసంగవశాన శ్రీవరవరమునుల జ్ఞానానుష్ఠానవైభవాన్నిగూర్చి అణ్ణన్ కు తెలిపారు. వెంటనే అణ్ణన్ శ్రీరంగానికి వెళ్ళి, వరవరమునులవద్ద పంచసంస్కారాలను పొంది, వారి ప్రధానశిష్యులలో ఒకరయ్యారు. శాస్త్రవాదంలో ప్రతివాదులకు తమ వాదపటిమతో భయాన్ని కలిగించినందున వీరికి ప్రతివాది భయంకరులనే బిరుదు వచ్చింది. తరువాతి కాలంలో వీరి వంశస్థులకు ఇదే ఉపపదంగా స్థిరపడింది.

ఒకానొక సందర్భంలో గొప్ప విద్వాంసుడైన ఒక అద్వైతసన్న్యాసి శ్రీరంగానికి వచ్చి వరవరమునులను శాస్త్రవాదానికి పిలిచినపుడు, శ్రీవరవరమునులు తమ శిష్యులైన అణ్ణన్ ను వాదానికి పంపించారు. ఆచార్యాజ్ఞను శిరసావహించి అణ్ణన్ ఆ అద్వైతపండితునితో వాదించి, భగవద్రామానుజసిద్ధాంతమే వేదతాత్పర్యానుగుణమని నిరూపించారు. అపుడు అణ్ణన్ కు ప్రతివాది భయంకరులనే బిరుదు కలిగింది. వేదాంతదేశికుల విషయంలో ప్రావణ్యాన్ని కల అణ్ణన్ తల్లిదండ్రులు తమ పుత్రునకు వేదాంతాచార్యులనే పేరును పెట్టారనే ప్రసిద్ధి ఉన్నది.

అణ్ణన్ మొదట కొంతకాలం నయనవరదాచార్యులవారి సన్నిధిలో సామాన్యశాస్త్రాలను, శ్రీభాష్యాన్ని అధ్యయనం చేశారు. తరువాత, మణవాళ

మహామునుల సన్నిధిలో రహస్యగ్రంథాలను, ద్రావిడ వేదాంతాన్ని అధికరించారు. దేశికుల శ్రీసూక్తులను పరిపూర్ణంగా గ్రహించి, వారి విషయంలో గొప్ప ప్రావణ్యాన్ని పొందారు. అందువల్లనే అణ్ణన్ తనియన్ లో "వేదాంతదేశికకటాక్షవివృద్ధబోధం, కాంతోపయంతృయమినః కరుణైకపాత్రమ్ "అని వారికి ఈ ఇద్దరు మహాచార్యులతో కల సంబంధం సూచింపబడింది.

వేదాంత దేశికుల విషయంలో తమకు కల భక్తిప్రపత్తులను వ్యక్తం చేస్తూ అణ్ణన్ "సప్తతిరత్నమాలికా "అనే ఒక అందమైన స్తోత్రాన్ని రచించారు. ఇందులో రత్నాలవంటి 73 శ్లోకాలున్నాయి. అందువల్ల ఈ పేరు వచ్చింది. ఇందులో అణ్ణన్ దేశికుల అవతారవైభవాన్ని ప్రస్తావించి, ఆ ఆచార్యులు తిరుమలక్షేత్రంలో వేంకటేశ్వరుని కోవెలలోని గంటయొక్క అంశతో వేంకటేశ్వరుని బ్రహ్మోత్సవాలలో చక్రతీర్థదివసమైన శ్రవణా నక్షత్రంలో ఆవిర్భవించారని అన్నారు. ఈ స్తుతిలో అణ్ణన్ ప్రధానంగా నాలుగు అంశాలనుగూర్చి తెలిపారు అవి: 1)దేశికుల కల్యాణగుణాల వైభవం 2) దేశికుల శ్రీసూక్తివైభవం 3)దేశికభక్తికి కల ప్రాధాన్యం, 4)దేశికుల దివ్యమంగళవిగ్రహవైభవం

దేశికుల దివ్యకల్యాణగుణాలను వర్ణిస్తూ అణ్ణన్ ప్రధానంగా ఈ క్రింది అంశాలను తెలిపారు:

1) దేశికులు సదా భగవద్భక్తుల పాదుకలనే శరణంగా భావిస్తారు. ఇందువల్ల వారికి కల భగవద్భక్తితోపాటు, భాగవతప్రావణ్యంకూడా తెలుపబడింది.

2)దేశికులు దివ్యమైన జ్ఞానం, భగవద్భక్తి, వైరాగ్యం, కారుణ్యం, ఇంద్రియనిగ్రహం, సౌశీల్యం, ధైర్యం, శాంతి మొదలైన అన్ని కల్యాణగుణాలను నిండుగా కలవారు.

3)కామ, కోపం, అసూయ, లోభం, కాపట్యం మొదలైన ఏ దోషాన్ని లేనివారు.

4)వేదాధ్యయనంలో దేశికులు వేదవ్యాసమహర్షివంటివారు. కల్పసూత్రాల అర్థాన్ని నిర్వహించడంలో సమర్థులు. వారికి జ్యోతిషం, తర్కం, వ్యాకరణం మొదలైన శాస్త్రాలలో కల జ్ఞానం అసాధారణం.

5)దివ్యసూరుల ప్రబంధాల అర్థాలనే అమృతాన్ని ఆస్వాదించడంలో వారు నిమగ్నులై ఉంటారు.

6)సాంఖ్యం, యోగం, అద్వైతం, జైనం, బౌద్ధం, శైవం మొదలైన ఇతరమతాలలోని రహస్యాలనుకూడా దేశికులు లోతుగా తెలిసినవారు .అందువల్లనే

వారు వాటిని పూర్వపక్షం చేయగలిగారు.

7)ఉభయవేదాంత సంప్రదాయాన్ని సురక్షితం చేసినందున వీరికి పలు బిరుదులను శ్రీరంగనాథుడు, శ్రీరంగనాయకి అనుగ్రహించారు.

8)దేశికులు పలు పూర్వాచార్యగ్రంథాలకు వ్యాఖ్యాత, కవితార్కికసింహులుగా శ్రీరంగనాయకిచే సంభావింపబడ్డారు.

9)దేశికులు ఉత్తమాచార్యలక్షణపూర్తిని, ఉత్తమశిష్యలక్షణపూర్తిని కలవారు.

దేశికుల సూక్తులలోని వైభవాన్ని వర్ణించేటపుడు అణ్ణన్ ఈక్రింది విషయాలను ప్రస్తావించారు:

1)దేశికులు శతాధికగ్రంథాలను అనుగ్రహించారు. వీటిలో ప్రతి గ్రంథం మన ఇహపరలోకయోగక్షేమాలను కలిగించగలిగినది.

2) దేశికుల కృతులు మన మనసులోని దోషాలను పోగొడతాయి. మంచిగుణాలను ఉద్బుద్ధం చేస్తాయి.

3)దేశికుల గ్రంథాలు ప్రకృతజన్మావసానంలో మోక్షపురుషార్థాన్ని పొందిస్తాయి.

4)దేశికుల గ్రంథాలను ప్రతి పండితుడు చాలా గౌరవిస్తాడు.

5)దేశికులను ఇష్టపడనివారుకూడా వారి గ్రంథాలను వాటి విషయగౌరవాన్నిబట్టి ఇష్టపడతారు.

6)చిరకాలం శ్రమిస్తే కాని తెలియని కఠినమైన తత్త్వార్థాలనుకూడా దేశికుల గ్రంథాలను అధ్యయనం చేస్తే సులభంగా, చాలా తక్కువ సమయంలో తెలిసికోవచ్చు.

7)దేశికులు అనుగ్రహించిన పరమతఖండనగ్రంథాలైన శతదూషణి, పరమతభంగం, సర్వార్థసిద్ధి మొదలైన గ్రంథాలను అధ్యయనం చేస్తే ఇతరమతాలను సులభంగా జయించవచ్చు.

దేశికభక్తికి కల ముఖ్యత్వాన్ని వివరించేటపుడు అణ్ణన్ ఈక్రింది అంశాలను ప్రస్తుతించారు:

1)ప్రతి ముముక్షువు దేశికుల విషయంలో భక్తిని కలిగి ఉండాలి.

2)కొందరు అల్పజ్ఞులు దేశికులను నిందించవచ్చు. అటువంటివారు ఎంత గొప్ప పండితులైనా, ఎన్ని గుణాలను కలవారైనా, వారిని మనం కంటితో చూడకూడదు. గౌరవించకూడదు. అటువంటివారు భగవద్రామానుజుల అనుగ్రహాన్ని ఏనాటికీ పొందలేరు. వారిని దేశికుల నిరుపాధికకృపమాత్రమే రక్షించగలదు.

ఈ విషయాలనేకాక ఈ స్తుతిలో గోచరించే ఈక్రింది అంశాలనుకూడా గమనించాలి:

1)దేశికుల దివ్యమంగళవిగ్రహవర్ణన.

2)నయనవరదాచార్యులవారి దేశికమంగళాన్ని అనుసంధించిన తరువాత ఈ సప్తతిరత్నమాలికలోని 10వ, 59వ, 17వ 65వ, 23వ, 55వ శ్లోకాలు అనుసంధింపబడడం దీని ప్రాశస్త్యాన్ని, ప్రాముఖ్యాన్ని తెలుపుతున్నది.

**శ్రీమాన్ వేంకటనాథార్యః కవితార్కికకేసరీ,**

**వేదాంతాచార్యవర్యో మే సన్నిధత్తాం సదా హృది.**

<u>ప్రతివాది భయంకరమ్ అణ్ణన్ తనియన్ శ్లోకాలు</u>

**వేదాంతదేశికకటాక్షవివృద్ధబోధమ్**

**కాంతోపయంతృయమినః కరుణైకపాత్రమ్,**

**వత్సాన్వవాయ మనవద్యగుణై రుపేతం**

**భక్త్యా భజామి పరవాది భయంకరార్యమ్.**

దేశికుల అనుగ్రహంవల్ల వేదాంతశాస్త్రంలో అభివృద్ధి చెందిన జ్ఞానాన్ని కలవారు, మణవాళ మహామునుల అద్వితీయకృపకు పాత్రమైనవారు, శ్రీవత్సవంశంలో అవతరించినవారు, ఏ దోషం లేని గుణాలను కలవారైన ప్రతివాది భయంకరం అణ్ణన్ ను భక్తితో భజిస్తున్నాను.

**శ్రీమత్త్రయీమకుటదేశికపాదపద్మజి**

**భృంగాయమాణవరదార్యదయైకపాత్రమ్,**

**తత్సూక్తిలేశవిభవాత్తసమస్తతత్త్వం**

**భక్త్యా భజామి పరవాది భయంకరార్యమ్.**

శ్రీవేదాంతదేశికుల పాదపద్మాలను ఆశ్రయించిన తుమ్మెదవంటివారైన కుమారవరదాచార్యులవారి దయకు పాత్రమైనవారు, ఆ వరదాచార్యులవారి సూక్తలేశంవల్ల తత్త్వార్థాలను అన్నిటిని గ్రహించినవారైన ప్రతివాదిభయంకరం అణ్ణన్ అనే ఆచార్యులను భక్తితో భజిస్తున్నాను.



**శ్రీమతే రామానుజాయ నమః**

**శ్రీమతే నిగమాంత మహాదేశికాయ నమః**

ప్రతివాది భయంకరమ్ అణ్ణన్ అనుగ్రహించిన

# సప్తతిరత్నమాలికా

1) **జీవనం జగతాం జీయాత్ కిమప్యపగతస్పృహమ్,**
**స్వతంత్రం సర్వతంత్రేషు వేంకటేశాహ్వయం మహః.**

శ్రీవేదాంతదేశికులు ఈ జగత్తుకు జీవనం. వారికి లౌకికవిషయాలపట్ల ఏవిధమైన ఆసక్తి లేదు. వారి వైరాగ్యం నిరుపమానమైనది. వారు అన్ని విద్యలలో సాటి లేని నిపుణులు. ఇటువంటి వేదాంతదేశికులనే గొప్ప జ్యోతిస్సు సర్వోత్కర్షతో సదా వర్ధిల్లాలి.

2) **శోశ్రూయమాణా యచ్ఛబ్దం కవితార్కికకుంజరాః,**
**స్వప్నే ప్రసుస్నువుర్నిత్యం సింహం కమపి తం భజే.**

కవులలో, తార్కికులలో గజాలవలె ఉండే గొప్పవారుకూడా కలలో వేదాంతదేశకుల నామాన్ని వింటే చాలు, చాలా భయపడతారు. అటువంటి, కవులకు తార్కికులకు సింహంవంటివారైన వేదాంతదేశికులను భజిస్తున్నాను.

3) **శ్రీమతాం హరిదాసానాం పాదరక్షావలంబినా.**
**తేన వేంకటనాథేన సనాథా స్సుఖినో వయమ్.**

వేదాంతదేశికులు భగవద్భక్తుల పాదుకలను తమకు రక్షకమని భావిస్తారు. ఆటువంటి భాగవతనిష్ఠను కల వేదాంతదేశికులను మనకు రక్షకులుగా కల మనం సుఖంగా ఉన్నాము.

4) **వేదాంతదేశికపదం యస్మై శ్రీరంగశాయినా,**
**దత్తం తస్మై నమస్కుర్మో వేంకటేశవిపశ్చితే.**

శ్రీరంగనాథుడు వేదాంతదేశికులకు వేదాంతాచార్యులనే బిరుదును ఇచ్చాడు.

అటువంటి వేదాంతదేశికులనే విద్వాంసుల సన్నిధిలో మనం నమస్కరిద్దాం.

**5) దక్షిణోత్తరదేశీయసూక్త్యా వరదదేశికః,**
**యస్మాదజని సోదర్య స్తస్మాన్నాన్యా గతిర్మమ.**

వేదాంతదేశికులవల్ల పలు సంస్కృతద్రావిడభాషలలో శ్రీసూక్తులు ఉద్భవించాయి. ఆవిధంగానే, నయనవరదాచార్యులవారుకూడా వేదాంతదేశికులవల్లనే అవతరించారు. దేశికుల సంస్కృతద్రావిడసూక్తులు వరదాచార్యులవారితో సోదరసంబంధాన్ని కలిగి ఉన్నవి. అటువంటి వేదాంతదేశికులకంటే ఇంకొక గతి ఏదీ నాకు లేదు.

**6) జ్ఞానం తు వినయో భక్తిః సంపత్తి ర్వీతరాగతా,**
**ఆరోగ్యం యస్య తస్యాస్మి దాసో వేదాంతసద్గురోః.**

జ్ఞానం, వినయం, భక్తి, మిగిలిన అన్ని కల్యాణగుణాలను కలిగి ఉండడమనే సంపద, వైరాగ్యం, ఆరోగ్యం-అనేవి వేదాంతదేశికులలో నివాసం ఉన్నాయి. ఆటువంటి, వేదాంతదేశికులకు నేను దాసుడను.

**7) యస్మిన్ననన్యసామాన్యా వేదాంతాచార్యతా గురౌ,**
**యథా పురుషతా విష్ణౌ తస్మిన్ న్యస్తభరోఽస్మ్యహమ్.**

విష్ణువులో "స ఏవ వాసుదేవోసౌ సాక్షాత్ పురుష ఉచ్యతే" ఆనే విధంగా అనన్యసామాన్యమైన పురుషత్వం సహజంగా ఉన్నట్లు, వేదాంతదేశికులలో అనన్యసామాన్యమైన వేదాంతాచార్యత్వం సుప్రతిష్ఠితమై ఉన్నది. అటువంటి వేదాంతదేశికుల సన్నిధిలో నేను నా రక్షణభారాన్ని సమర్పించాను.

**8) సర్వతంత్రస్వతంత్రత్వాత్ శాస్త్రదీపప్రదానతః,**
**శ్రీవేంకటాద్రినాథోఽసౌ సాక్షాద్వేదాంతదేశికః.**

భగవానుడు సర్వతంత్రస్వతంత్రుడు. ఏ పనిని అయినా ఎవరి సహాయసహకారాలులేకుండానే నిర్వహించగలిగినవాడు. ఆస్వామి వేదాల రూపంలోని శాస్త్రాలను ప్రసాదించాడు. వేదాంతదేశికులుకూడా సర్వతంత్రస్వతంత్రులే. అంటే?అన్ని శాస్త్రాలను స్వయంగా నిర్వహించగలిగినవారే. వారు పలు శాస్త్రగ్రంథాలను రచించి లోకానికి శాస్త్రప్రదానాన్ని చేశారు. అందువల్ల వేదాంతదేశికులు సాక్షాత్తు వేంకటేశ్వరుడే.

భగవానుడు వేదాలనే కాక, పాంచరాత్రశాస్త్రాన్నికూడా సాక్షాత్తుగా ప్రవర్తింపజేశాడు. "పాంచరాత్రస్య కృత్స్నస్య వక్తా నారాయణః స్వయమ్" అని చెప్పబడుతున్నది.

9) **ఆవిర్భూతిః యస్య వంశాదనర్ఘాత్**
**వైశ్వామిత్రాద్విష్ణుఘంటాంశకస్య,**
**శ్రీమాన్ సోఽయం సర్వతంత్రస్వతంత్రో**
**వక్తా వ్యాఖ్యా సార్వభౌమో విభాతి.**

వేదాంతదేశికులు విశ్వామిత్రకులంలో వేంకటేశ్వరుని ఘంటయొక్క అంశతో అవతరించారు. ఆ మహాచార్యులు అన్ని శాస్త్రాలలో స్వతంత్రులు. చక్కగా మాట్లాడడంలో నేర్పరి. పలు శాస్త్రీయాలైన పూర్వాచార్యుల గ్రంథాలను వివరించిన వ్యాఖ్యానచక్రవర్తియై ప్రకాశిస్తున్నారు.

10) **భాద్రపదమాసగతవిష్ణువిమలర్ క్షే**
**వేంకటమహీధ్రపతితీర్థదినభూతే,**
**ప్రాదురభవజ్జగతి దైత్యరిపుఘంటా**
**హంత! కవితార్కికమృగేంద్రగురుమూర్త్యా.**

కవితార్కికసింహులనే బిరుదును కల వేదాంతదేశికులు భాద్రపదమాసంలోని శ్రవణానక్షత్రంలో వేంకటేశ్వరుని బ్రహ్మోత్సవాలలో చక్రతీర్థదివసంలో దైత్యులకు శత్రువైన ఆ భగవానుని దివ్యాలయంలోని ఘంటాంశతో అవతరించారు. ఆహా!ఎంత ఆనందం!

11) **తమిమం శ్రీమద్వేంకటనాథాచార్యం వదంతి కిల సంతః,**
**శ్రీవేంకటాద్రినాథం సదసద్గుణరాశియోగహానిభ్యామ్.**

వేంకటేశ్వరునివలె వేదాంతదేశికులుకూడా సమస్తకల్యాణగుణాలను కలవారు. ఏ దోషాన్ని లేనివారు. అందువల్ల సత్పురుషులు వేదాంతదేశికులను వేంకటేశ్వరునితో భావిస్తున్నారు.

12) **శ్రీభాష్యం విరచయ్య సంయమివరో జిత్వా స్వయం వాదినో**
**బాహ్యాంశ్చాపి కుదృష్టికాన్ భువి పునర్భాష్యప్రతిష్ఠాశయా,**
**శ్రీమద్వేంకటనాథదేశికశిరోరత్నాత్మనాఽఽవిర్భభౌ**

**ఇత్యేవం చ వదంతి హంత! కృతిన స్త్రైకాలికజ్ఞానినః.**

"భగవద్రామానుజులు శ్రీభాష్యగ్రంథాన్ని రచించి, వేదబాహ్యులు, వేదకుదృష్టులైన ప్రతివాదులతో స్వయంగా వాదించి, వారిని జయించారు. 150 సంవత్సరాల తరువాత ఆ శ్రీరామానుజులే మళ్ళీ ఈ లోకంలో శ్రీభాష్యార్థాలను సుప్రతిష్ఠితం చేయాలని వేదాంతదేశికులుగా అవతరించారు."-అని త్రికాలజ్ఞులైన మహనీయుల అభిప్రాయం.

**13) అవనాయ సతా మసద్గుణ ప్రబలాటోపనిబర్హణాయ చ,**
**అపి వైష్ణవధర్మవృద్ధయే జననం శ్రీనిగమాంతసద్గురోః.**

సత్పురుషులను కాపాడడంకోసం, చెడ్డవారిని నిగ్రహించడంకోసం, శ్రీవైష్ణవధర్మాన్ని వృద్ధిచేయడంకోసం వేదాంతదేశికులు అవతరించారు. భగవానుడు గీతలో తన అవతారాల ప్రయోజనాలు "పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్, ధర్మసంస్థాపనార్థాయ సంభవామి" అని అంటూ సజ్జనరక్షణ, దుర్జనశిక్షణ, ధర్మసంస్థాపనలే అని అన్నాడు. వేదాంతదేశికుల అవతారప్రయోజనాలుకూడా ఈ మూడే కనుక, దేశికుల అవతారం భగవదవతారమేనని తాత్పర్యం.

**14) యద్యయం కవితార్కికసింహో నాభవిష్యదిహ భువ్యవతీర్ణః,**
**తర్హి బాహ్యకుదృగుద్ధతపక్షైః మేదినీ పరివృతా హ్యభవిష్యత్.**

కవితార్కికసింహులైన దేశికులు ఈ భూమిలో అవతరించి ఉండకపోతే బాహ్యమతవాదులు, కుదృష్టివాదులు లోకంలో అంతటా వ్యాపించి ఉండేవారు. వేదాలను ప్రమాణంగా అంగీకరించనివారు వేదబాహ్యులనబడతారు. వేదాన్ని ప్రమాణంగా అంగీకరించినా అందంలోని తత్త్వాలను దానికి విరుద్ధంగా గ్రహించి వాదించేవారు కుదృష్టివాదులనబడతారు.

**15) వేంకటేశ్వరవిపశ్చితి జాతే నిస్సపత్న మభవత్ కిల భాష్యమ్,**
**తత్త్వమప్రతిహతం చ తదాసీద్యేన మోక్షపదవీ సుఖలభ్యా.**

శ్రీవేదాంతదేశికుల అవతారం తరువాత శ్రీభాష్యానికి విరోధులు లేకుండా పోయారు. మోక్షాన్ని సులభంగా అనుగ్రహించే ఈశ్వరతత్త్వం లోకంలో అంతటా వ్యాపించింది. అందువల్ల మోక్షం అందరికీ సులభంగా పొందదగినదిగా అయినది.

**16) పుత్రోఽనంతసూరేః పురుషసమగుణః పుండరీకాక్షయష్టుః**

**పౌత్ర స్తోతారభిఖ్యాశ్రుతవరజననీగర్భవారాశిచంద్రః,**
**విశ్వామిత్రాన్వవాయో వరదగురుపితా వాదిహంసాంబువాహాత్**
**ఆచార్యాదాప్తశాస్త్రో వరదగురుమతః సర్వతంత్రః స్వతంత్రః.**

సర్వతంత్రస్వతంత్రులైన వేదాంతదేశికులు సాధ్వీమణి అయిన తోతారాంబగర్భమనే పాలసముద్రంలో పుట్టిన చంద్రుడు, అనంతసూరికి పుత్రులు. పితామహులైన పుండరీకాక్షయజ్వకు కల కల్యాణగుణాలను అన్నిటిని కలిగినవారు. వారు విశ్వామిత్రకులంలో అవతరించారు. కుమార వరదాచార్యులవారికి తండ్రి. వాది హంసాంబుదాచార్యులవారనే పేరును కలవారు మేనమామ అయిన ఆత్రేయ రామానుజాచార్యులవారి(అప్పుళ్ళార్) సన్నిధిలో అన్ని శాస్త్రాలను అధికరించారు. వాత్స్యవరదగురువులనే నడాదూర్ అమ్మాళ్ కటాక్షానికి పాత్రులు. ఇటువంటి వైభవాలను కల వారు వేదాంతదేశికులు. వేదాంతదేశికుల చరిత్రలోని విశేషాలను ఈ శ్లోకం సంగ్రహంగా తెలుపుతున్నది. మూడు తరాల సంబంధం ఇందులో ప్రస్తావింపబడింది.

17) **అనంతసూరిసూనవేఽభినంద్యమానవైభవాత్**
**దిగంతవాదిహంసజైత్రకాలమేఘదేశికాత్,**
**ఉపాత్తసర్వశాసనాయ హంత! వర్షవింశతౌ**
**పునఃపునర్నమస్క్రియాస్తు వేంకటేశసూరయే.**

అనంతసూరికి పుత్రులు, దిగంతాలవరకు కీర్తి వ్యాపించిన వాదిహంసాంబుదాచార్యులవారనే(పరవాదులనే హంసలకు భయాన్ని కలిగించే మేఘంవంటి వారైన) ఆత్రేయ రామానుజాచార్యులవారి సన్నిధిలో ఇరవై ఏళ్ళవయసు నిండడానికి ముందే అన్ని శాస్త్రాలను అధికరించినవారైన వేదాంతదేశికులకు మాటిమాటికి నమస్కారం.

18) **వేదాంతాచార్యవర్యో విదితబహుగుణో వీతరాగాగ్రయాయీ**
**విద్వాన్ విద్యానిషద్యా విరచితవివిధానేకదివ్యప్రబంధః,**
**విష్ణౌ విష్ణ్వాశ్రితేషు ప్రకటితవినయప్రేమశేషత్వవృత్తిః**
**విఖ్యాతః శ్రేయసే స్యాత్ విషయజిదిహ నో వేంకటాచార్యవర్యః**

వేదాంతదేశికులు వేదాంతాచార్యులనే బిరుదాన్ని కలవారు. వారి ప్రసిద్ధి

చెందిన పలు కల్యాణగుణాలను కలవారు. వైరాగ్యాన్ని కలవారిలో గొప్పవారు. వారు సమస్తవిద్యలను కలవారు. ఎన్నో గ్రంథాలను రచించారు. భగవానుని విషయంలో, భగవద్భక్తుల విషయంలో వినయాన్ని, ప్రేమను, శేషత్వాన్ని కలవారు. అటువంటి దేశికులు మనకు శ్రేయస్సును కలిగించాలి.

**19) యస్సంస్కృతకవితాయాం ప్రౌఢిమ్నా?న్వేతి కూరనాథసుతమ్,**
**ద్రావిడకవితామార్గే పరకాలం వా?థ భక్తసారం వా.**

సంస్కృతంలో గొప్పదైన కవితను పలుకడంలో దేశికులు కూరేశుల కుమారులైన పరాశరభట్టర్ తో సాటి. ద్రావిభాషలో కవిత్వాన్ని రచించడంలో తిరుమంగై ఆళ్వార్లతో, లేక, తిరుమழிశై ప్పిరాన్ తో (భక్తసారమునితో) సమానం.

**20) పరశ్శతం వా౨పి పరస్సహస్రం**
**శ్రీవేంకటాచార్యకృతాః ప్రబంధాః,**
**తత్రాలమేకః ఖలు భుక్తిముక్త్యోః**
**కార్త్స్న్యేన కస్తాన్ గణయేత్ సమస్తాన్.**

దేశికుల శ్రీసూక్తులు వందలు, వేలు ఉన్నాయి. ఇహలోకపరలోకప్రయోజనాలను పొందడానికి వాటిలో ఒక్కటి చాలు. దేశికుల ప్రబంధాలను పూర్తిగా ఎవరు లెక్కించగలరు?

**21) యదీయచరితం సతాం సుచరితవ్యవస్థాపకం**
**యదీయవచనం పరం సకలసంశయోన్మూలనమ్,**
**యదీయకరుణా గతిః సకలధర్మశూన్యాత్మనాం**
**స్సన శ్శరణమస్త్వసౌ సకలతంత్రనిర్వాహకః.**

వేదాంతదేశికులు సర్వతంత్రస్వతంత్రులు. అన్ని శాస్త్రార్థాలను స్వయంగా నిర్వహించగలిగినవారు. వారి చరిత్ర సత్పురుషులకు సన్మార్గదర్శకం. గొప్పవైన వారి సూక్తులు అన్ని సందేహాలను తీరుస్తాయి. వారి కరుణ ఏ గతి లేనివారికి గొప్ప గతి.

**22) దాంతి శ్శాంతి శ్శుచిత్వం విషయవిజయితా ధీరతా నిస్స్పృహత్వం**
**శేషత్వం శ్రీశతద్దాసజనవిషయకం పారతంత్ర్యం చ తత్ర,**
**అక్షోభ్యత్వం పటుత్వం మృదుసమవశితా నిర్భరత్వానసూయే**

**యస్మిన్నాజానసిద్ధం స ఖలు విజయతే వేంకటాచార్యవర్యః.**

బాహ్యేంద్రియనిగ్రహం, అంతరింద్రియనిగ్రహం, మనఃశౌచం, లౌకికవిషయాలపట్ల ఆసక్తి లేకపోవడం, ఎటువంటి సన్నివేశంలో అయినా మనస్సులో మార్పును పొందకపోవడం, ఆశారాహిత్యం, భగవంతునకు, తద్దాసులకు శేషమై ఉండడం, వారికి పరతంత్రులై ఉండడం, మనస్సులో కలతను పొందకపోవడం, మానసికపటుత్వం, మనసు మృదువుగా ఉండడం, అందరిపట్ల సమంగా వర్తించడం, అందరిని వశం చేసికోగల్గడం, నైర్భర్యం, అసూయారాహిత్యం-అనే ఈ సద్గుణాలన్నీ వేదాంతదేశికులకు ఆజానసిద్ధాలు (పుట్టుకతో వచ్చినవి).

23) **కలయే సతతం కరుణాజలధిం**
**కరుణావిషయం కమలాధిపతేః,**
**కలివైరిశఠారివచోరసికం**
**కవితార్కికకేసరిసూరిగురుమ్.**

వేదాంతదేశికులు దయాగుణానికి సముద్రం(అంతులేని దయాగుణాన్ని కలవారు). భగవానుని దయకు పాత్రమైనవారు. నమ్మాళ్వార్ల, తిరుమంగై ఆళ్వార్ల సూక్తులలో గొప్ప ఆసక్తిని కలవారు. కవితార్కికసింహమనే బిరుదును కలవారు.

24) **సరోభూతవేతాళసారస్వతానాం**
**శఠద్విట్ కలిధ్వంసిముఖ్యోదితానామ్,**
**అవిచ్ఛిన్నసత్సంప్రదాయార్థవేదీ**
**గురుర్వేంకటేశో గురూక్తిష్వతుల్యః..**

వేదాంతదేశికులు సరోయోగి(పొయ్ గై ఆళ్వార్), భూతయోగి(పూదత్తాళ్వార్), మహాయోగి(పేయాళ్వార్) అనుగ్రహించిన సూక్తులలోని, శఠకోపులు(నమ్మాళ్వార్లు), కలివైరిసూరి(తిరుమంగై ఆళ్వార్లు) మొదలైన ఆళ్వార్లు అందరు పలికిన సూక్తులలోని, అవిచ్ఛిన్నంగా అనాదిగా వచ్చే సత్ సంప్రదాయార్థాలను తెలిసినవారు, గొప్ప సూక్తులను అనుగ్రహించడంలో సాటిలేనివారు.

25) **యుక్తా అలూక్షా అపి ధర్మకామాః**
**సమర్థినో యుక్తిసమన్వితాశ్చ,**
**సద్బ్రాహ్మణా వేదశిరఃప్రసిద్ధాః**

**శ్రీవేంకటాచార్యముఖా హి నూనమ్.**

వేదాలలో విధింపబడిన విధానాలను అనుసరించేవారు, కోపాన్ని, ఆశను లేనివారు, ధర్మాలలోని సూక్ష్మాలను గమనించి తెలిసి, వానిని ఇతరులకు తెలిపేవారు, భగవద్ధర్మానుసారంగా వర్తించేవారు, వేదార్థాలను తెలియడంలో తగిన యుక్తులను ప్రయోగించేవారు ఎవరంటే-వేదాంతదేశికులవంటివారు.

**26) జటావర్ణచర్చాద్యనేకప్రకార**
**త్రయీలక్షణోచ్చారణే వ్యాసకల్పః ,**
**తథా కల్పసూత్రప్రయోగాద్యభిజ్ఞో**
**జయత్యన్వహం సర్వతంత్రస్వతంత్రః.**

జట, ఘనం, పద వర్ణక్రమం మొదలైన వైదికాంశాలకు అనుగుణంగా వేదాలను అధ్యయనం చేరడంలో వ్యాసునివంటివారు, కల్పసూత్రానుసారంగా వైదికకర్మల నిర్వాహంలో సమర్థులైన, సర్వతంత్రస్వతంత్రులైన వేదాంతదేశికులు గొప్పగా ప్రకాశిస్తున్నారు.

**27) భరద్వాజశాండిల్యహారీతముఖ్య**
**స్మృతిస్తోమసూక్ష్మార్థనిర్ణీతిదక్షః,**
**పురాణాగమాదిష్వసాధారణశ్రీః**
**సుతో భాతి లోకేష్వనంతార్యసూరేః.**

అనంతసూరికి పుత్రులైన వేదాంతదేశికులు భారద్వాజస్మృతి, శాండిల్యస్మృతి హారీతస్మృతి మొదలైన పలు స్మృతులలోని, అర్థాలను నిర్ణయించడంలో సమర్థులు, పురాణాలు, ఆగమాలు మొదలైనవానిలో అసామాన్యమైన జ్ఞానాన్ని కలవారు.

**28) జ్యోతిశ్ఛందశ్శబ్దశాస్త్రప్రవీణః**
**కావ్యశ్రేణీనాటకాలంకృతిజ్ఞః,**
**మీమాంసాయాం బ్రహ్మకర్మానుకాయాం**
**స్రష్టా సాక్షాత్ సర్వతంత్రస్వతంత్రః.**

సర్వతంత్రస్వతంత్రులైన వేదాంతదేశికులు జ్యోతిశ్శాస్త్ర, ఛందశ్శాస్త్ర, వ్యాకరణశాస్త్రాలలో ప్రవీణులు. పద్యగద్యకావ్యరచనలో సమర్థులు. కర్మమీమాంస,

బ్రహ్మమీమాంస-అనే ఉభయమీమాంసాశాస్త్రాలలో జైమిని, వ్యాసమహర్షులవంటివారు.

**29) సాంఖ్యే యోగే భట్టతంత్రే గురూక్తే**
**శైవే జైనే శాంకరే భాస్కరే చ,**
**శాస్త్రే బౌద్ధే యాదవే గర్వితానాం**
**ప్రత్యాఖ్యాతా సర్వతంత్రస్వతంత్రః.**

సర్వతంత్రస్వతంత్రులైన వేదాంతదేశికులు సాంఖ్యమతంలో, యోగమతంలో, భాట్టమీమాంస, ప్రాభాకరమీమాంసలనే రెండు మీమాంసామతాలలో, శైవ, బౌద్ధమతాలలో, శాంకరాద్వైతంలో, భాస్కరాద్వైతంలో యాదవప్రకాశమతంలో గర్వించిన, వాదానికి వచ్చిన ప్రతివాదులను నిరసించారు. ఈ మతాలన్నీ దేశికుల పరమతభంగమనే గ్రంథంలో నిరసింపబడ్డాయి.

**30) సర్వోజ్జీవనచింతయా ఘటకతాభావేన దానాత్కృతి**
**శ్రేష్ఠానాం బహుశ స్తదుద్ధరణతః త్రయ్యంతసంరక్షణాత్,**
**శ్రీమచ్ఛ్రీశఠకోపముఖ్యదివిషన్నాథార్యరామానుజాజి**
**చార్యానప్యనుయాతి హంత!నిగమాంతాచార్యచూడామణిః.**

శ్రీదేశికులు సంసారంలో చిక్కుకొని, ఆ పంకంనుండి బయటపడలేక బాధపడే జీవులను సంరక్షించడంకోసం సదాచార్యులుగా గొప్ప కైంకర్యాలను చేశారు. అవి ఏవి? అంటే-తత్వార్థాలను, రహస్యార్థాలను బోధించే గ్రంథాలను రచించడం, శ్రీభాష్యంలోని జ్ఞాతవ్యార్థాలను కాలక్షేపరూపంలో ఉపదేశించడం, ఉభయవేదాంతార్థాలను తెలిపే నాథమునులు, యామునులు, రామానుజులు మొదలైన పూర్వాచార్యుల సూక్తులను సంరక్షించడం-అనేవి. ఇవి అన్నీ ఆస్తికాగ్రేసరులు ప్రశంసించదగిన గొప్ప, నిస్స్వార్థసేవలుకదా!

జీవులను అందరిని తరింపజేయాలనే ఆలోచనను కలిగి ఉండడం, పురుషకారకృత్యాన్ని చేయడం, గొప్ప గ్రంథాలను అనుగ్రహించడం, పూర్వాచార్యగ్రంథాలను సంరక్షించడం, వేదాంతపరిరక్షణను చేయడం-అనే వీటివల్ల శఠకోపాదిదివ్యసూరులతో, నాథమునులతో, యామునులతో, రామానుజులతో నిగమాంతదేశికులు పోలి ఉన్నారు. ఆహా! ఎంత ఆశ్చర్యం!

**31) ఇహ రంగపతిప్రసాదలబ్ధోదయ వేదాంతధురంధరత్వకీర్తిః,**
**అపి తత్సహధర్మిణీకృపాత్తాఖిల తంత్రప్రభుతాక ఏష సూరిః.**

దేశికులు శ్రీరంగనాథుని అనుగ్రహంవల్ల ఉభయవేదాంతాచార్యులనే కీర్తిని పొందారు. ఆవిధంగానే, ఆ భగవానుని సహధర్మచారిణి అయిన శ్రీరంగనాయకి కృపవల్ల సర్వతంత్రస్వతంత్రులనే గొప్ప బిరుదును పొందారు.

**32) అఖిలతంత్రధురంధరతా హరేః**
**త్వయి తు వేంకటనాథ! గురౌ స్థితా,**
**విధిశివాదిజనేష్వితరేషు వా**
**క్వచిదపీహ న సా పరిదృశ్యతే.**

భగవానుడే(హయగ్రీవుడే) అన్ని విద్యలకు నిర్వాహకుడు. వేదాంతదేశికస్వామీ ఆ మహిమను స్వామి మీయందే ఉంచాడు. ఈ గొప్పతనం శివునకుకాని, బ్రహ్మకుకాని, ఇక ఏ దేవతలకుకాని దక్కలేదు.

**33) క్షమాయాం హి యస్యోపమానం ముకుందః**
**శ్రుతౌ తస్య తల్పో మతౌ దేవమంత్రీ,**
**జయే వైరిణాం దైత్యసంహారకారీ**
**స జీయాచ్చిరం సర్వతంత్రస్వతంత్రః.**

దేశికులు క్షమాగుణంలో భగవానుని, శాస్త్రజ్ఞానంలో భగవానునకు తలపమైన అదిశేషుని, బుద్ధిలో దేవగురువు బృహస్పతిని, శత్రుజయంలో దైత్యారి అయిన భగవానుని పోలి ఉన్నారు. అటువంటి దేశికులు చిరకాలం వర్ధిల్లాలి.

**34) ఆచార్యత్వోపయుక్తా మునిగణకథితా దేశికైః స్వేన చోక్తాః**
**సర్వే భద్రా గుణా స్యుః సముదితవిభవా స్సర్వతంత్రస్వతంత్రే,**
**శిష్యత్వే చోపయుక్తా అపి చ గుణగణాః కూరనాథే యథా స్యుః**
**నాన్యత్రాచార్యవర్గే కతిచన హి గుణాః ప్రాయశః తత్ర దృష్టాః.**

వేదాంతదేశికుల, వారికి ముందున్న పలువురు మునులు ఉత్తమగురులక్షణాలను, ఉత్తమాచార్యలక్షణాలను నిర్వచించారు. సర్వతంత్రస్వతంత్రులైన దేశికులలో ఆ ఉత్తమాచార్యలక్షణాలు వైభవంతో ప్రకాశిస్తున్నాయి. ఉత్తమశిష్యలక్షణాలు

కూరనాథులలో పూర్ణంగా ఉన్నట్లే దేశికులలోకూడా ఉన్నాయి. ఇక మిగిలిన ఆచార్యవర్గంలో కొన్ని ఉత్తమాచార్యగుణాలు, కొన్ని ఉత్తమగుణాలుమాత్రమే గోచరిస్తాయి. పూర్తిగా ఉత్తమాచార్య, శిష్యలక్షణాలను కలవారు దేశికులొక్కరే.

ఈశ్లోకంలోని భావాన్ని "న హి నిందాన్యాయం"లో దేశికుల వైభవాన్ని తెలుపడంలోమాత్రమే దృష్టిని కలిగినదని, మిగిలిన ఆచార్యులను తక్కువచేసి పలకడంలో ఉద్దేశ్యం కలిగినది కాదని గ్రహించాలి

**35) యతిపతిసంప్రదాయపరిపోషకస్య సతతం నిగమాంతగురోః.**
**అతిపతితామృతాసరసతాగుణేన సుమనసస స్రజో మృదుతరా,**
**అధిగతలక్షణా విమలసూక్తిరార్తిశమనీ విపక్షమథనీ**
**కలయతు న శ్శుభాని భగవత్తదీయయతిరాజహర్షజననీ.**

వేదాంతదేశికుల సూక్తులు భగవద్రామానుజ సంప్రదాయాన్ని నిత్యం పోషిస్తున్నాయి. అవి మాధుర్యంలో అమృతాన్ని మించినవి. సువాసనలో పూలమాలను మించినవి. అవి దోషాలు లేనివి. గుణాలను కలిగినవి. సంసారతాపాన్ని తీర్చగలిగినవి. పరమతాలను నిరసించగలిగినవి. భగవానునకు ఆ భగవానుని భక్తులకు, భగవద్రామానుజులకు ఆనందాన్ని కలిగించగలిగినవి.

**36) అపి చ భవాహిదష్టపరిమూర్ఛితస్య భవినః ప్రబోధనకరీ**
**శమదమదోషభీతిభగవత్తదీయజనభక్తిముక్తిజననీ,**
**విషయపరత్వకోపమదమోహలోభశఠతాదిదోషశమనీజి**
**భువి సదృశీతరాస్తి న హి సూక్తిరద్య నిగమాంతదేశికగిరః.**

దేశికసూక్తులు సంసారమనే భయంకరమైన సర్పం కాటు వేసినందున స్మృతిని కోల్పోయిన సంసారులను ఉజ్జీవింపజేయగలిగినవి. శమాన్ని, దమాన్ని, దోషాలంటే భయాన్ని, భగవంతుని విషయంలో, తద్భక్తుల విషయంలో భక్తిని, ఇహలోకప్రయోజనాలను, ముక్తిని కలిగిస్తాయి. లౌకికవిషయాల విషయంలో ఆసక్తిని, కోపం, మదం, మోహం, లోభం, వంచన మొదలైన దోషాలను పోగొడుతుంది. వేదాంతదేశికసూక్తులకు సాటి వచ్చేవి ఈ లోకంలో ఏవీ లేవు.

**37) కర్మవిచికిత్సా వృత్తవిచికిత్సా**
**ధర్మవిచికిత్సా సర్వవిచికిత్సు,**

**శామ్యతి హి నూనం సర్వపురుషాణాం**
**వేంకటవిపశ్చిద్వాగ్విలసితేన.**

వేదాంతదేశికుల సూక్తులవల్ల వైదికకర్మలనుగూర్చి కలిగే సందేహాలు, అదేవిధంగా, వాటిని ఆచరించడంలో కలిగే సందేహాలు, పలు ధర్మాలను తెలియడంలో కలిగే సందేహాలు, ఇంకా అన్ని సంశయాలు తప్పక తీరిపోతాయి.

38) **యదుక్తయో యతిపతితంత్రదీపికాః**
**సలక్షణా స్సరసతమా స్సతాం మతాః,**
**సమత్సరైరపి సతతం పరోక్షతః**
**ప్రశంసితాః పరికలయేత్ స నః శ్రియమ్.**

వేదాంతదేశికుల సూక్తులు భగవద్రామానుజదర్శనంలోని తత్త్వాలను ప్రకాశింపజేసే దీపాలు. అవి వ్యాకరణాదిశాస్త్రాలను అనుగుణమైన లక్షణాలను కలిగినవి. చాలా సరసమైనవి. మహనీయులు అంగీకరించినవి. వారిపట్ల అసూయను కలవారుకూడా వారి సూక్తులను పరోక్షంలో ప్రశంసిస్తారు. అటువంటి దేశికులు మనకు మంచిని కలిగించాలి.

39) **వాణీ యస్య ద్రామిడీ సాంస్కృతీ చ**
**ప్రాయః ప్రాచా మాశయానన్వవాదీత్,**
**అర్వాచామప్యాస వైయాత్యమూలం**
**జీయాత్ సోయం సర్వతంత్రస్వతంత్రః.**

సంస్కృతంలో, ద్రావిడంలో దేశికులు అనుగ్రహించిన సూక్తులు మహర్షులు, ఆళ్వారులు, పూర్వాచార్యులు మొదలైన పూర్వుల అభిప్రాయాలను అనుసరించి పలికినవి. నూతనంగా పలికినవి కాదు. తరువాతకాలంవారికి తమతమ గ్రంథాలను నిర్మించడంలో మూలమయ్యాయి. అటువంటి, సర్వతంత్రస్వతంత్రులైన దేశికులు సర్వదా వర్ధిల్లాలి.

40) **యదీయకృతిషు క్షణం పరిచిత స్సతాం చాతురీం**
**తనోతి బహువత్సరశ్రమ మనుస్తుతామన్యతః,**
**తమద్య యతిభూపతిప్రథితసన్మతోద్ధారకం**
**భజే కవికథారతద్విరదబృందకంఠీరవమ్.**

వేదాంతదేశికుల గ్రంథాలను అభ్యసిస్తే ఎంతోకాలం ఎన్నో గ్రంథాలను అభ్యసించినందువల్ల కలిగే జ్ఞానం ఏర్పడుతుంది. అన్యగ్రంథాలవల్ల ఇటువంటి జ్ఞానాన్ని పొందాలంటే చాలా కాలం పడుతుంది. అటువంటి, భగవద్రామానుజుల నామంతో ప్రసిద్ధమైన సిద్ధాంతాన్ని ఉద్ధరించేవారైన, కవితార్కికసింహులనే బిరుదును కల వేదాంతదేశికులను భజిస్తున్నాను.

**41) కవివాదికరిసింహకృతిరత్నతిలకం**
**యతిరాజవరసప్తతిమిమా మనుదినమ్,**
**ప్రవదంతి పరవాదతిమిరౌఘమిహిరాః**
**త ఇమే హి యతిరాజకరుణైకవిషయాః.**

వేదాంతదేశికుల కృతులలో తిలకంవలె ప్రధానమైన యతిరాజసప్తతిని ప్రతిదినం అనుసంధించేవారు, ప్రతివాదులనే చీకటిని పారదోలే సూర్యునివంటివారు కాగలరు. వారు యతిరాజుల కృపకు పాత్రులవుతారు.

**42) వేంకటేశవిదుషా రచితానాం**
**జ్ఞాయతే న గణనాపి కృతీనామ్,**
**తత్ర చాపి న హి రంగపతిశ్రీ**
**పాదుకాస్తుతిసహస్రసమా?న్యా.**

వేదాంతదేశికులు అనుగ్రహించిన గ్రంథాల సంఖ్యకూడా పూర్తిగా తెలియదు. వాటిలోకూడా, శ్రీరంగనాథపాదుకాసహస్రమనే స్తుతికి సాటి వచ్చే స్తుతి ఇంకొకటి ఏదీ లేదు.

**43) వేంకటేశగురుగ్రథితాం యే**
**పాదుకాస్తుతిసహస్ర మజస్రమ్,**
**సార్థబోధ మనుసందధతే తే**
**సంయమీంద్రమతసారవిద స్స్యు.**

వేదాంతదేశికులు రచించిన పాదుకాసహస్రమనే స్తుతిని అర్థానుసంధానసహితంగా నిత్యం పఠించేవారు భగవద్రామానుజసిద్ధాంతంలోని సారస్యాన్ని తెలిసినవారవుతారు.

44) **అనన్యసాధారణచాతురీ చ**
**కావ్యాదిషు బ్రహ్మవిదగ్రణీత్వమ్,**
**తథాష్టభాషాకవితాపటుత్వం**
**సంకల్పసూర్యోదయదృశ్యమస్య.**

కావ్యనాటకాదికృతులను రచించడంలో వేదాంతదేశికులకు కల అసాధారణసామర్థ్యం, వారు బ్రహ్మవేత్తలలో అగ్రగణ్యులనే విషయం, వారికి కల అష్టభాషా పాండిత్యం-అనే విషయాలన్నీ సంకల్పసూర్యోదయం ద్వారా వ్యక్తమవుతున్నాయి.

45) **దూషణ్యాదౌ తార్కికాగ్రేసరత్వం**
**స్పష్టం శ్రీమద్వేంకటేశస్య సూరేః,**
**అన్యాలభ్యా చాతురీ పద్యగుంఫే**
**సర్వజ్ఞత్వం తత్త్వముక్తాకలాపే.**

వేదాంతదేశికులు గొప్ప తార్కికులనే విషయం శతదూషణి అనే గ్రంథంలో తెలుస్తున్నది. వారి అనన్యసామాన్యమైన చాతుర్యం వారి పద్యరచనలో స్పష్టమవుతుంది. వారి సర్వజ్ఞులనే విషయం తత్త్వముక్తాకలాపమనే గ్రంథంవల్ల తెలుస్తుంది.

46) **కలయతాం కవితార్కికకేసరి**
**ప్రకటితం శతదూషణికాం హృది ,**
**మశకవత్ సుజయాః ఖలు మాయినః**
**ప్రణిపతంతి పరం పదయోర్ముహుః.**

కవితార్కికసింహులైన వేదాంతదేశికులు రచించిన శతదూషణి అనే గ్రంథాన్ని అధ్యయనం చేసేవారు మాయావాదులను, దోమలనువలె, అవలీలగా జయిస్తారు. ఓడిపోయిన ప్రతివాదులు వారి పాదాలలో అపజయభారంవల్ల మాటిమాటికి వాలిపోతారు.

47) **అహహా! శంకరయాదవభాస్కర**
**గ్రథితదుర్మదదుర్మతవాదినామ్,**
**కలకలః కవితార్కికకేసరి**

**ప్రథితదూషణికాశ్రవణావధిః.**

శాంకర, యాదవ భాస్కరాది మతాలకు చెందిన, గర్వించిన ప్రతివాదులు చేసే కోలాహలం అంతా వేదాంతదేశికులు రచించిన శతదూషణిని విన్నంతవరకే. అ తరువాత ప్రతివాదిలోకం అంతా వారికి అధీనమై పోతుంది.

48) **సర్వార్థసిద్ధి శ్శతదూషణీ చ**
**ద్వే ఖేటశాస్త్రే కథకాగ్రగానామ్,**
**అద్యేన తత్ర క్రియతే స్వరక్షా**
**ప్రత్యర్థిభంగః కలహేఽన్యతరః స్యాత్**

సర్వార్థసిద్ధి, శతదూషణి అనే రెండు గ్రంథాలు పరమతాలవారితో వాదించేవారికి గొప్ప కవచాలవంటివి. వాటిలో, మొదటిది తమ మతాన్ని రక్షించుకోవడానికి, రెండవది వాదయుద్ధంలో ప్రతివాదులను ఓడించడానికి ఉపయోగపడతాయి.

49) **అత ఏవ సర్వజగతాం స గురుః**
**యతిచక్రవర్తిమతమత్తదిగ్గజః,**
**కవితార్కికద్విరదపంచముఖో**
**హ్యత ఊర్జితం హ్యకృతభాష్యమిదమ్.**

కవితార్కికసింహులైన వేదాంతదేశికులు భగవద్రామానుజుల మతంవల్ల మదించిన(సాత్త్విగర్వాన్ని పొందిన) దిగ్గజంవంటివారు. దిగ్గజాలు జగత్తును భరిస్తాయి. ఆ విధంగానే, దేశికులు యతిరాజుల శ్రీభాష్యాన్ని భూమిలో స్థిరంగా నిలిపి దాని స్థితిని కాపాడారు. అందువల్ల దేశికులు దిగ్గజంవంటివారు. ఇటువంటి దేశికులు సమస్తజగత్తుకు ఆచార్యులయ్యారు.

50) **శ్రుతిశీర్షదేశికశిరోమణినా**
**జనకేన యేన హి సుశిక్షితధీః,**
**వరదో గురుశ్చ యతిరాజమత**
**ప్రతివాదికోటిశతకోటిరభూత్.**

దేశికుల కుమారులైన వరదాచార్యులవారు దేశికుల సన్నిధిలోనే చక్కని

శిక్షణను పొందినవారై, భగవద్రామానుజమతాన్ని ఎదిరించే ప్రతివాదులు పలికే వాదకోటిని ఖండించడంలో శతకోటి(నూరువాదాలను పలికేవారు, లేక, వజ్రాయుధంవంటివారు) అయ్యారు.

**51) సర్వతంత్రధూర్వహస్య వేంకటేశధీమతః**
**కుర్వతో?వమాననాం తు కేచనాధునోద్గతాః,**
**హంత!హంత!రామకృష్ణదూషణాభిధాయినాం**
**కిన్ను చిత్రమత్ర చైద్యరావణానుసారిణామ్.**

ఈనాడు కొందరు సర్వతంత్రస్వతంత్రులైన దేశికులను దూషించడానికి ప్రయత్నిస్తున్నారు. అయ్యో! శ్రీరాముని, శ్రీకృష్ణుని దూషించిన రావణశిశుపాలాదులను అనుసరించే వీరు ఈ విధంగా దూషించడంలో ఏమి ఆశ్చర్యం?

**52) అపి కామమదలోభశఠతాదిరహితాః**
**అపి నీతిధృతిశాంతిమతిదాంతిసహితాః,**
**యతిరాజమతధుర్యపదపద్మవిముఖాః**
**అవలోకనతిమాననుతిబాహ్యవిషయాః**

కామం, మదం, లోభం మోసం మొదలైన దోషాలు లేకపోయినా, నీతి, ధైర్యం, శాంతి, జ్ఞానం, ఇంద్రియనిగ్రహం మొదలైన గుణాలున్నా, భగవద్రామానుజసిద్ధాంతనిర్వాహకులైన వేదాంతదేశికుల పాదపద్మాల విషయంలో విముఖులైనవారు చూడదగినవారు, నమస్కరించదగినవారు, గౌరవించదగినవారు, స్తుతించదగినవారు కాబోరు.

**53) విమతిరథవా తేషాం యుక్తా యతీశ్వరజీవనే**
**కవికథకపంచాస్యే దేవే సతాం చ ధురంధరే,**
**పరిచితిరహో తన్మాహాత్మ్యప్రకాశకతత్కృతి-**
**ష్వపి లవమితా స్వప్నేఽప్యేషాం యతో న హి విద్యతే.**

ఈ విధంగా వేదాంతదేశికుల విషయంలో కొంతమంది వైమత్యాన్ని కలిగి ఉండడం యుక్తమేనని తోస్తుంది. ఏ విధంగా? అంటే, కవితార్కికసింహులు, భగవద్రామానుజసిద్ధాంతానికి ప్రాణం, సత్పురుషులలో గొప్పవారైన వేదాంతదేశికుల

గ్రంథాలలో వారికి కలలోకూడా ఏమాత్రం పరిచయం లేదు కనుక వారు విముఖతను కలిగి ఉన్నారు. దేశికుల గొప్పదనాన్ని వ్యక్తం చేసే వారి కృతులతో పరిచయం కలవారు ఎవరైనా వారి విషయంలో వైముఖ్యాన్ని కలిగి ఉండలేరు.

**54) న ద్రష్టారో వైభవస్యాస్య సాక్షాత్**
**నైవాభ్యాస స్తత్కృతిష్వస్తి తేషామ్,**
**యేషాం నిత్యం మానసం సాభ్యసూయం**
**తేషాం భక్తి స్స్యాత్ కథం వేంకటేశే.**

వేదాంతదేశికుల వైభవాన్ని సాక్షాత్తుగా ఎవరు దర్శించలేదో, వారి గ్రంథాలతో అభ్యాసం ఎవరికి లేదో, ఎవరి మనస్సు అసూయను కలిగి ఉన్నదో, వారికి వేదాంతదేశికుల విషయంలో భక్తి ఏవిధంగా కలుగుతుంది?

**55) గురౌ వాదిహంసాంబుదాచార్యశిష్యే**
**జనా భక్తిహీనా యతీంద్రాప్రియా స్స్యుః,**
**యతీంద్రాప్రియా విష్ణుకారుణ్యదూరాః**
**కుతో ముక్తివార్తా హి తాదృగ్విధానామ్**

వాదిహంసాంబుదాచార్యులవారనే అప్పుళ్ళార్ కు శిష్యులైన దేశికుల విషయంలో భక్తి లేనివారు భగవద్రామానుజుల అభిమానాన్ని పొందలేరు. భగవద్రామానుజాభిమానాన్ని పొందలేనివారు భగవానుని దయకు దూరమవుతారు. అటువంటివారికి ముక్తి ఏవిధంగా లభిస్తుంది?

**56) నిఃశ్రేయసం యేఽభిలషంతి తస్య**
**మూలం కృపాం చాపి రమాసఖస్య,**
**దయాం యతీంద్రస్య చ తైరవశ్యం**
**కార్యా హి భక్తిః కవివాదిసింహే.**

మోక్షాన్ని పొందాలని కోరుకొనేవారికి భగవత్కృప, భగవద్రామానుజకృప ఆవశ్యకం. అందువల్ల వారు దేశికులపట్ల భక్తిని కలిగి ఉండాలి.

**57) సేవా విష్ణోః వైష్ణవారాధనాంతా.**
**తద్వత్ సేవా స్వామిన స్సంయమీనామ్,**

**వేదాంతాచార్యాంఘ్రిపద్మార్చనాంతా**

**యస్మాదాత్మా వేంకటేశస్య సూరేః.**

భగవత్సేవ భాగవతసేవతో పూర్తి అవుతుంది. ఆ విధంగానే, భగవద్రామానుజుల ఆరాధన దేశికుల పాదపద్మసేవతో పూర్తి అవుతుంది. ఎందుకు? అంటే-భగవద్రామానుజులు దేశికులకు ఆత్మ కనుక.

58) **కర్మాద్యుపాయా ఇహ కేచన స్యుః**

**కేచిచ్చ లక్ష్మీరమణాంఘ్ర్యుపాయాః,**

**శ్రీమద్యతీంద్రప్రియవేంకటేశ**

**గుర్వంఘ్ర్యుపాయా వయమేవ ధన్యాః.**

కొందరు కర్మయోగాదులను మోక్షోపాయాలుగా అనుష్ఠిస్తున్నారు. మరికొందరు లక్ష్మీనాథుని పాదాలను ఉపాయంగా ఆశ్రయిస్తున్నారు. కాని, మేముమాత్రం భగవద్రామానుజులకు ఇష్టులైన దేశికులనే ఆచార్యుల శ్రీచరణాలనే ఉపాయంగా కలిగినవారమై, ధన్యులమయ్యాము.

59) **సశంఖచక్రలాంఛనః సదూర్ధ్వపుండ్రమండితః**

**సకంఠలగ్నసత్తులస్యనర్ఘపద్మమాలికః**

**సితాంతరీయసూత్తరీయయజ్ఞసూత్రశోభితో**

**మమావిరస్తు మానసే గురు స్స వేంకటేశః**

భుజాలలో సుదర్శనపాంచజన్యలాంఛనాలను కలవారు, చక్కని ఊర్ధ్వపుండ్రాలతో అలంకరింపబడినవారు, మంచి తులసీపూసల, తామరపూసలమాలికలను ధరించినవారు, తెల్లని ధోవతితో, చక్కని ఉత్తరీయంతో, యజ్ఞోపవీతంతో శోభిల్లేవారైన వేదాంతదేశికులు నా మనస్సులోసదా ప్రకాశించాలి. ఈశ్లోకం ఇందులోని ధ్యానశ్లోకమనదగినది.

60) **నిగమాంతదేశికపదాంబుజద్వయం**

**నిరసూయవైష్ణవజనప్రియం ధనమ్,**

**కులదైవతం మమ కుదృష్టిమస్తక**

**క్షితిభృద్విభేదికులిశాయుధాయ్యుతమ్.**

వేదాంతదేశికుల శ్రీచరణద్వయం అసూయలేని విష్ణుభక్తులకు ప్రియమైన ధనం, నాకు కులదైవం, కుదృష్టిమతవాదుల బుద్ధి అనే కొండలను బ్రద్దలుకొట్టే వజ్రాయుధం.

**61) మహోత్పలాయితపాదయుగళం**
**రతిప్రియేషుధిప్రతిరోధిసుజంఘికమ్,**
**కకుత్సమానసుజానుకమంచిత**
**స్ఫురత్కటీవిలసత్పరిధానకమ్.**

**62) ప్రశస్తనాభిక ముజ్జ్వలవక్షసం**
**ప్రసన్నసస్మితసన్ముఖపంకజమ్,**
**మదీయహృత్కమలాసనసంస్థితం**
**భజామి వేంకటనాథవిపశ్చితమ్.**

సహస్రపత్రసమానమైన రెండు శ్రీచరణాలను, మన్మథుని అంబులపొదిని మించిన అందమైన చక్కని పిక్కలను, ఎద్దుమూపురాల కంటే అందమైన మోకాళ్ళను, ప్రకాశించే నడుములో వెలిగే పరిధానాన్ని, అందమైన నాభిని, గొప్పగా ప్రకాశించే వక్షస్సును, ప్రసన్నమైన, చిరునవ్వును కల చక్కని పద్మంవంటి ముఖాన్ని కలవారై, నా హృదయకమలాన్ని అధిష్ఠించిన వేదాంతదేశికులను నేను భజిస్తున్నాను.

**63) ప్రబుద్ధతామరసాభవిలోచనం**
**ప్రసిద్ధశిష్యజనైః పరివారితమ్,**
**ప్రబుద్ధరాగతమం గురుపాదయోః**
**ప్రబుద్ధచేతస మర్థసమర్థనే.**

**64) సరత్నకంబళపీఠపరిగ్రహం**
**సమర్థముత్థితసంశయనోదనే,**
**విరక్తసజ్జనసంఘశిరోమణిం**
**భజామి వేంకటనాథవిపశ్చితమ్.**

చక్కగా వికసించిన తామరపూలవంటి నేత్రాలను కలవారు, ప్రసిద్ధి చెందిన శిష్యులను చుట్టూ కలవారు, ఆచార్యుల పాదాలలో మిక్కిలి భక్తిని కలవారు,

తత్త్వార్థాలను వివరించి సమర్థించడంలో ఆసక్తిని కలవారు, రత్నకంబళిని పరచిన ఆచార్యసింహాసనంలో వేంచేసి ఉన్నవారు, సందేహాలను తీర్చడంలో సమర్థులు, వైరాగ్యాన్ని కల మహనీయులకు శిరోమణివంటివారైన వేదాంతదేశికులనే విద్వాంసులను భజిస్తున్నాను.

**65) కవితార్కికకలభవ్రజకబళీకృతిసింహం**
**కమలాపతికరుణారసపరివర్ధితబోధమ్,**
**యతినాయకపదపంకజయుగళీపరతంత్రం**
**భజ మానస! బుధవేంకటపతిదేశికమనిశమ్.**

ఓ మనసా! కవులు, తార్కికులనే గజాలను కబళీకరించడంలో(ఓడించడంలో) సింహంవంటివారు, శ్రియఃపతి దయవల్ల జ్ఞానవృద్ధినిపొందినవారు, భగవద్రామానుజుల శ్రీచరణపద్మాలు రెండిటికి పరతంత్రులైన దేశికులను సదా భజించు.

**66) యతినృపతిపదకమలసకలవిధబంధుం**
**కరిశిఖరిపతినగరసుచిరకృతవాసమ్,**
**భజ హృదయ! కవికథకహరిమపి చ రంగ**
**క్షితిరమణచరణయుగసతతకృతసేవమ్.**

ఓమనసా! భగవద్రామానుజుల శ్రీచరణాలను సకలవిధబంధువుగా తలచేవారు, కాంచీనగరంలో చిరకాలం నివసించినవారు, శ్రీరంగనాథుని పాదసేవలను సదా చేసినవారైన కవితార్కికకేసరులైన వేదాంతదేశికులను భజించు.

**67) అతిమృదులమనస మతివిపులశుభనేత్రమ్**
**అతిచతుర మధికగుణయతినృపతిభాష్యే,**
**ఉపకరణపర మనిశమపకరణశీలే-**
**ష్వపి కలయ మమ హృదయ! కవికథకసింహమ్.**

ఓ హృదయమా! చాలా మృదువైన మనస్సును కలవారు, చాలా విశాలమైన, అందమైన నేత్రాలను కలవారు, గొప్ప గుణాలను కల భగవద్రామానుజుల శ్రీభాష్యాన్ని నిర్వహించడంలో మిక్కిలి నేర్పరులు, తమకు సదా అపకారాన్ని చేసేవారి విషయంలోకూడా ఉపకారాన్ని చేసే స్వభావం కలవారైన కవితార్కికసింహులైన వేదాంత

దేశికులను భజించు.

**68) భో నిగమమౌళియుగదేశిక! దయామృతసముద్ర! భగవన్!**
**మామకమిదం వచనమద్య శృణు నాథ! కవితార్కికహరే,**
**సోహమతిఖిన్నమిహ వీక్ష్య జనమత్ర భవదంఘ్రివిముఖం**
**త్వం చ కురు తావకపదాంబుజయుగప్రవణమద్య కృపయా.**

భగవన్! వేదాంతదేశికస్వామీ! దయాసముద్రా! కవితార్కికసింహమా! నాథా! దాసుడనైన నా ఈ మాటను ఆలకించండి. నేను చాలా దుఃఖాన్ని పొందినవాడనై, దేవరవారి శ్రీచరణాలపట్ల విముఖతను కలిగినవాడనై ఉన్నానని చూచి నా విషయంలో దయచూపించి, మీపాదాలలో భక్తిని కలవాడను అయేటట్లు అనుగ్రహించాలి.

**69) కించ మమ మానసమిదం చ సముదంచిత మిహాన్యవిషయే-**
**ష్వంచతి న జాతు కవివాదికరిపంచముఖ! తావకపదమ్,**
**వంచనపరం శఠమకించనజనప్రియ! సపంచశరజం**
**చంచలమిదం పునరచంచలతరం కురు భవచ్చరణయోః.**

ఓ కవితార్కికసింహమా! వేదాంతదేశికాచార్యా! నా మనస్సు లౌకికవిషయాలలో ఆసక్తిని కలిగి ఉన్నది తప్ప, మీ శ్రీపాదాలపట్ల ఆసక్తిని ఏమాత్రం పొందడంలేదు. అకించనులైన నావంటివారి విషయంలో ప్రేమను కల దేశికస్వామీ! వంచనపరుడను, దుష్టుడను, కామాన్ని కలవాడను, చంచలస్వభావుడనైన నన్ను మీపాదాలలో అచంచలమైన ప్రేమను కలవాడను అయేటట్లు చేయాలి.

**70) శ్రీవేంకటేశస్య గురోః పదాబ్జయోః**
**సమర్పితా సప్తతిరత్నమాలికా,**
**ధృతా సుధీభి ర్హృదయే విమత్సరే**
**పుష్ణాతి శోభాం పురుషార్థనిర్భరామ్.**

శ్రీవేదాంతదేశికులనే ఆచార్యుల శ్రీచరణాలలో సమర్పింపబడిన ఈ సప్తతిరత్నమాలిక అనే స్తుతి విద్వాంసులచే వారి హృదయంలో ధరింపబడినదై(మనస్సులో అనుసంధింపబడినదై), వారికి సకలపురుషార్థాలను కలిగించి, వారి హృదయానికి శోభను కలిగించగలదు.

**71) వేదాంతాచార్యసప్తత్యా గుణవత్యా పరిష్కృతాః,**
**వేదాంతవేద్యశ్రీభాష్యకారకారుణ్యగోచరాః.**

వేదాంతదేశికులను కీర్తించే ఈ స్తుతిలో డెబ్భై శ్లోకాలున్నాయి. ఇది వారి గుణాలను కీర్తించడంవల్ల అందంగా ఉన్నది. దీనిని సదా హృదయంలో ధరించడం వల్ల(అనుసంధించడం వల్ల) అందమైన హృదయాలను కలవారై వేదాంతవేద్యుడైన భగవానునియొక్క, భగవద్రామానుజులయొక్క దయను పొందగలరు.

**72) వీతరాగా విశిష్టార్థా వేదాంతాచార్యసప్తతిః**
**వైష్ణవై స్సాదరం గ్రాహ్యా విద్వద్భిర్వీతమత్సరైః.**

అసూయను లేనివారైన, పండితులైన వైష్ణవులు మాత్రమే విలక్షణమైన వేదాంతార్థాలను తెలిపే, పక్షపాతం లేని ఈ సప్తతిరత్నమాలిక అనే స్తుతిని అనుసంధించాలి.

**73) ప్రతివాదిభయంకరేణ సా**
**సుధియా సప్తతిరత్నమాలికా.**
**నిగమాంతగురౌ సమర్పితా**
**హృదయే తద్భజతా స్వయా ధియా.**

సప్తతిరత్నమాలిక అనే స్తుతిని ప్రతివాది భయంకరం అణ్ణన్ అనే ఆచార్యులు వేదాంతదేశికుల విషయంలో రచించి, దేశికులను తమ హృదయంలో ఆరాధించేవారికోసం సమర్పించారు.

**కవితార్కికసింహాయ కల్యాణగుణశాలినే,**
**శ్రీమతే వేంకటేశాయ వేదాంతగురవే నమః.**



**శ్రీమతే రామానుజాయ నమః**

**శ్రీమతే నిగమాంత మహాదేశికాయ నమః**

శ్రీ చోళసింహపురం దొడ్డయాచార్యస్వామి అనుగ్రహించిన

# శ్రీవేదాన్తదేశిక వైభవ ప్రకాశికాస్తోత్రమ్

## అవతారిక

మహాచార్యులని, దొడ్డయాచార్యులని వ్యవహరింపబడే ఈ ఆచార్యవర్యులు చోళసింహపురనివాసి. ఈ దివ్యదేశం సంప్రదాయంలో "తిరుక్కడికై" అని పిలువబడుతున్నది. తిరుత్తణికి సుమారు 20 కి. మీ దూరంలో ఉండే ఈ క్షేత్రంలో రెండు కొండలున్నాయి. పెద్ద కొండపై యోగనరసింహస్వామి, చిన్నకొఃడపై యోగాంజనేయస్వామి వేంచేసి ఉన్నారు.

దొడ్డయాచార్యస్వామి కంచి వరదరాజస్వామివిషయంలో అంతు లేని భక్తిప్రపత్తులను కలిగి ఉండేవారు. ప్రతీ ఏడు విధిగా కంచి గరుడసేవను సేవించుకొనేవారు. కొంతకాలానికి వృద్ధులైన దొడ్డయాచార్యస్వామివారు ఒక ఏడు వరదరాజస్వామిగరుడోత్సవాన్ని సేవించుకోలేకపోయారు. అందువల్ల మనస్సులో చాలా బాధపడ్డారు. అపుడు వరదరాజస్వామి స్వయంగా గరుడవాహనంపై ఆసీనుడై, దొడ్డయాచార్యస్వామివారికి సేవను అనుగ్రహించాడు. ఆ సందర్భానికి గుర్తుగా చోళసింహపురంలోని పుష్కరిణి ఒడ్డున నిర్మింపబడిన వరదరాజస్వామి కోవెలను ఇప్పటికీ దర్శించవచ్చు. చోళసింహపంరంలోని కోవెలకైంకర్యనిర్వాహాలను ఈనాటికీ వీరి వంశస్థులే చేస్తున్నారు.

దొడ్డయాచార్యస్వామివారు దేశికుల శతదూషణి అనే వాదగ్రంథానికి చండమారుతమనే వ్యాఖ్యానాన్ని అనుగ్రహించారు. దానికి గుర్తుగా వారి వంశస్థులు

తమ పేరులో ఈనాటికీ చండమారుతమనే ఉపపదాన్ని కలిగి ఉన్నారు. దొడ్డయాచార్యస్వామి క్రీ. శ. 1509-1591 మధ్యకాలంలో వేంచేసి ఉన్నట్లు తెలుస్తున్నది. ఉపనిషద్భాష్యకారులైన శ్రీరంగరామానుజమునికి, పంచమహాభంగ తాతాచార్యస్వామివారికి(కాంచీపురం) వీరు సమకాలికులు. ఈ తాతాచార్యస్వామివారు అహోబిలమఠం 6వ పట్టాన్ని పొందిన అ*ழ*కియ శింగర్ కు శిష్యులు. దొడ్డయాచార్యస్వామివారు ఆచార్యవింశతి, శ్రుతితాత్పర్యనిర్ణయం, పారాశర్యవిజయం, అధికరణార్థసంగ్రహం మొదలైన గ్రంథాలను రచించారు.

**దొడ్డయాచార్యస్వామితనియన్:**

**వాధూలశ్రీనివాసార్యతనయం వినయోజ్జ్వలమ్,**

**ప్రజ్ఞానిధిం ప్రపద్యేఽహం శ్రీనివాసమహాగురుమ్.**

వాధూలకులంలో అవతరించిన శ్రీనివాసాచార్యుల పుత్రులు, వినయగుణంతో గొప్పగా ప్రకాశించేవారు, కులానికి నిధివంటివారైన శ్రీనివాసమహాగురువును శరణుపొందుతున్నాను.

**శ్రీనివాహాచార్యప్రాప్తవేదాంతసంపదమ్,**

**లక్ష్మణార్యదయాపాత్రం శ్రీనివాసమహాగురుమ్.**

శ్రీనివాసాచార్యులనే తమ తండ్రి దగ్గర నుండి వేదాంతశాస్త్రాన్ని అభ్యసించినవారు, లక్ష్మణాచార్యుల(రామానుజాచార్యుల) వారి దయకు పాత్రమైనవారై శ్రీనివాసగురువును(దొడ్డయాచార్యులవారిని) స్తుతిస్తున్నాను.

**శ్రీమాన్ వేంకటనాథార్యః కవితార్కికకేసరీ.**

**వేదాంతాచార్యవర్యో మే సన్నిధత్తాం సదా హృది.**

**శ్రీమతే రామానుజాయ నమః**
**శ్రీమతే నిగమాంత మహాదేశికాయ నమః**

శ్రీ చోళసింహపురం దొడ్డయాచార్యస్వామి అనుగ్రహించిన

# శ్రీవేదాన్తదేశిక వైభవ ప్రకాశికాస్తోత్రమ్

1) **కవివాది శిరోరత్నం కల్యాణ గుణ భూషణమ్,**
**విశ్వామిత్రాన్వయాబ్ధిన్దుం వేదాన్తగురుమాశ్రయే**

కవులలో, తార్కికులలో(వాదం చేసేవారిలో) రత్నంవలె ప్రధానమైనవారు, కల్యాణగుణాలను కలవారు, విశ్వామిత్రవంశమనే సముద్రంలో అవతరించిన చంద్రునివంటివారైన వేదాంతదేశికులను నమస్కరిస్తున్నాను.

2) **వేఙ్కటేశస్య సఙ్కల్పాద్ విశ్వామిత్రకులామ్బుధౌ,**
**ఘణ్టావతీర్ణా యన్మూర్త్యా తం దేశికవరం భజే**

వేంకటేశ్వరుని సంకల్పంవల్ల విశ్వామిత్రవంశమనే సముద్రంలో ఆ వేంకటేశ్వరుని ఘంటయొక్క అంశతో అవతరించిన ఆచార్యవర్యులను భజిస్తున్నాను.

3) **కాఞ్చ్యాం నభస్య శ్రోణాయామనన్తార్యగురోస్సుతః,**
**జాతో యో జన భాగ్యేన శ్రీమన్తం తమహం భజే**

కాంచీక్షేత్రంలో భాద్రపదమాసం శ్రవణానక్షత్రంలో అనంతసూరికి కుమారులుగా లోకంలోని ప్రజల భాగ్యంవల్ల అవతరించిన, భగవద్భాగవతభక్తి అనే సంపదను కల వేదాంతదేశికులను భజిస్తున్నాను.

4) **జాతకర్మాదికం సర్వం పితా యస్యాకరోద్గురోః,**

**తం వేఙ్కటేశమనిశం తోతారమ్బసుతం భజే**

వేదాంతదేశికులకు సకాలంలో జాతకర్మ మొదలైన వైదికసంస్కారాలను వారి తండ్రి అయిన అనంతసూరి చేశారు. అటువంటివారు, తోతారంబకు కుమారులైన వేదాంతదేశికులను భజిస్తున్నాను.

5) **అస్మాకం భవసఞ్చరశాన్తయే నిబుధాధిపః,**

**పద్భ్యాం చచార యో భూమ్యాం తం వన్దే వ్కేటాధిపమ్**

మన సంసారతాపాన్ని తీర్చడంకోసం తమ శ్రీచరణాలతో భూమిపై సంచరించిన వేదాంతదేశికులను నమస్కరిస్తున్నాను. భగవదవతారాలు ఈసంసారంలోని జీవుల తాపాన్ని తీర్చడంకోసం ఏర్పడినట్లే దేశికుల అవతారంకూడా లోకుల సంసారతాపాన్ని తీర్చడంకోసం ఏర్పడినదే-అని తాత్పర్యం.

6) **తృతీయాబ్దే గురోర్యస్యచూడాకర్మాऽకరోత్పితా,**

**పుణ్డరీకాక్ష పౌత్రం పురుషశ్రేష్ఠమాశ్రయే**

వేదాంత దేశికులవారికి మూడవ సంవత్సరంలో వారి తండ్రి అయిన అనంతసూరి చౌలం అనే వైదిక సంస్కారాన్ని చేశారు. పుండరీకాక్షసూరికి పౌత్రులైన ఆ వేదాంత దేశికులను నేను ఆశ్రయిస్తున్నాను.

7) **అక్షరాణి తతః సర్వాణ్యాచార్యాద్గురురగ్రహీత్,**

**యస్తం వేఙ్కటనాథార్యం వన్దే మతిమతాం వరమ్**

వేదాంత దేశికులకు ఆచార్యుల ద్వారా వారికి అక్షరాభ్యాసం చేయబడింది. బుద్ధిశాలి అయిన ఆ వేంకట నాథులను నేను నమస్కరిస్తున్నాను.

8) **అనన్తార్యగురుర్యస్య పితాऽనన్త గుణోజ్జ్వలః,**

**బ్రహ్మోపదేశమకరోత్తం భజే బ్రాహ్మణోత్తమమ్**

అనంత సూరి అంతులేని మంచి గుణాలతో ప్రకాశించే తమ పుత్రునకు బ్రహ్మోపదేశం చేశారు. గొప్ప బ్రాహ్మణోత్తములైన ఆ వేదాంత దేశికులను నేను నమస్కరిస్తున్నాను.

9) **మాతులాదఖిలామ్నాయాన్మతిమానగ్రహీచ్చ యః,**

**పునరుచ్చారణాపేక్షారహితం తం గురుం భజే**

గొప్ప బుద్ధిశాలి అయిన వేదాంత దేశికులు తమ మేనమామ అయిన ఆత్రేయ రామానుజాచార్యుల వారి సన్నిధిలో అన్ని వేదాలను, శాస్త్రాలను నేర్చారు. ఒక్కసారి చెబితే రెండవ మారు చెప్పనక్కర లేని రీతిలో అన్నిటిని అభ్యసించారు.

**10) శుద్ధాం కన్యాం శుభాచారాం తుల్య లక్షణసమ్యుతామ్,**
**ఉపయేమే విధానేన యోగురుస్తం భజామ్యహమ్**

శుద్ధమైన ఆచారాన్ని కలిగినది, తమకు తగినది, కళ్యాణ గుణాలను కలిగినది అయిన కన్యకను వేదాంత దేశికులు శాస్త్ర ప్రకారం వివాహం చేసుకొన్నారు. అటువంటి ఆ వేదాంత దేశికులను నేను కీర్తిస్తున్నాను.

**11) మీమాంసా తర్క శబ్దాది శాస్త్రాణ్యపి చ మాతులాత్,**
**అవాప వింశత్యబ్దే య స్తం విద్యానిధిమాశ్రయే**

మీమాంస, తర్కం, వ్యాకరణం మొదలైన శాస్త్రాలను తమ మాతుల పాదులు అయిన అప్పుళ్ళార్ దగ్గర తమకు 20 సంవత్సరాల వయస్సు రావడానికి ముందే నేర్చారు. అటువంటి విద్యానిధిని నేను శరణు పొందుతున్నాను.

**12) ఆత్రేయ రామానుజదేశికేన్ద్రాదవాప్య వేదాన్తయుగం పునర్యః,**
**మన్త్రం చగారుత్మతమాపతస్మాత్తమాశ్రయే వేఙ్కటదేశికేన్ద్రమ్**

వేదాంత దేశికులవారి ముఖంలోని తేజస్సును చూచి, వరద గురువు(నడాదూర్ అమ్మాళ్) అనే ఆచార్యులు వేదాంత దేశికులను "ప్రతిష్ఠాపితవేదాంత ప్రతిక్షిప్తబహిర్మతః, భూయః త్రైవిద్యమాన్యస్త్వం భూరికళ్యాణభాజనమ్"-(విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని స్థాపించి ఇతర మతాలను ఖండించి వైదికోత్తముల గౌరవానికి, గొప్ప శుభాలకు నీవు పాత్రుడవు కాగలవు) అని ఆశీర్వదించారు.

**13) కాఞ్చ్యా వినిష్క్రమ్య తతో మహాత్మా సమ్ప్రాప్య నాగేన్ద్ర పురం గురుర్యః,**
**ధ్యాయన్గరుత్మన్తమువాస తస్మిన్ తం వేదచూడాగురుమాశ్రయామః**

ఆత్రేయ రామానుజాచార్యులవారి దగ్గర నుండి సంస్కృత ద్రావిడ వేదాంతాలను, ఆ విధంగానే గరుడ మంత్రాన్ని దేశికులు నేర్చారు. అటువంటి వేదాంత దేశికులను నేను ఆశ్రయిస్తున్నాను.

**14) ప్రీతేన సమ్యగ్గరుడేన తేనాస్యోపదిష్టో హయవక్త్రమన్త్రః,**

**తంభక్తివైరాగ్య గుణోపపన్నంశ్రీమన్తమీడే శ్రుతిశేఖరార్యమ్**

వేదాంత దేశికులు చేసిన గరడమంత్రోపాసనంవల్ల గరుడ భగవానుడు చాలా సంతోషించాడు. భక్తి, వైరాగ్యం మొదలైన మంచి గుణాలు కలిగిన ఆ వేదాంత దేశికులకు హయగ్రీవ మంత్రాన్ని ఉపదేశించాడు. అటువంటివారు, విద్యా నిధి అయిన ఆ వేదాంతాచార్యులవారిని నేను ఆశ్రయిస్తున్నాను.

**15)యస్త్వౌషధాద్రౌ నృహరేః సమీపే ధ్యాయన్ హయగ్రీవపదాబ్జమన్త్రః,**
**ఆహ్లాదశీతామ్బువిలోచనోఽభూత్ఆమ్నాయ చూడాగురుమాశ్రయే తమ్**

ఔషధాద్రిపైన నరసింహస్వామి సన్నిధిలో వేదాంత దేశికులు హయగ్రీవమంత్రాన్ని, ఆ మంత్రంలోని అర్థాన్ని మనసులో ధ్యానిస్తూ, కన్నులలో ఆనందబాష్పాలు కలవారై, జపించారు. అటువంటి వేదాంత దేశికులను నేను ఆశ్రయిస్తున్నాను.

**16) స్థిత్వా పురో యస్య గురోః స్వవక్త్ర లాలాసుధాం వాజిముఖః ప్రసన్నః,**
**వి్శ్రాణయామాస విబోధహేతుం తం వేదచూడార్యమహం ప్రపద్యే**

వేదాంత దేశికులు చేసిన ఉపాసనతో చాలా ప్రసన్నుడైన హయగ్రీవుడు వారి ముందు నిలచి, జ్ఞానాన్ని ప్రసాదించే తన నోటిలోని లాలాజలమనే అమృతాన్ని వారికి అనుగ్రహించాడు. అటువంటి వేదాంత దేశికులను ఆశ్రయిస్తున్నాను.

**17)హయాననస్తోత్రమధాభిరామం పక్షీన్ద్ర పఞ్చాశత మప్యపూర్వమ్,**
**ముదా వితేనే విదుషాం వరో యః తం వేఙ్కటార్యం సతతం స్మరామి**

అప్పుడు వేదాంత దేశికులు చాలా సంతోషంతో అందమైన హయగ్రీవ స్తోత్రాన్ని, అపూర్వమైన గరుడ పంచాశత్ స్తోత్రాన్ని అనుగ్రహించారు. ఆ ఆచార్యులను నేను సదా భావిస్తాను.

**18) అథాచ్యుతస్య స్తుతిమద్భుతార్థతామ్ పఞ్చాశతం దేవపతేశ్చ దివ్యామ్,**
**తదాజ్ఞయా యోఽకృతసూరివర్యః తం వేఙ్కటాధీశ గురుం ప్రపద్యే**

తరువాత, అద్భుతమైన అర్థాన్ని కలిగిన దివ్యమైన అచ్యుత శతకాన్ని, శ్రీ దేవ నాయక పంచాశత్ స్తుతిని ఆ భగవానుని ఆజ్ఞతో రచించారు. అటువంటి ఆచార్యవర్యులైన వేదాంత దేశికులను నేను శరణు పొందుతున్నాను.

**19) చకార యః కన్తుకముఖ్యగాథాం తమాశ్రయే తత్త్వవిదగ్రగణ్యమ్**

ముమ్మణికోవై, నవ మణిమాలై, ఊశల్, పందు మొదలైన అందమైన ద్రావిడ ప్రబంధాలను వేదాంత దేశికులు రచించారు. తత్వవేత్తలలో గొప్పవారైన ఆ వేదాంత దేశికులను నేను శరణు పొందుతున్నాను.

**20) చక్రే గురుర్యో ఘుటికాఖ్య గాధాం గాధాం కుబేరాక్షివినోదనార్థామ్,**
**గాధాం చ రమ్యాపరిహాసయోగ్యాం తం భావయే సర్వకలాసు దక్షమ్**

వేదాంత దేశికులు, తిరువహీంద్ర పురం అనే దివ్య దేశంలోని భగవానుడు తన దేవేరితో ఆడే పపందు, కజల్, అమ్మానై అనే క్రీడలను దర్శించి, వానిని ఆ పేర్లతోనే అందమైన ప్రబంధాలుగా రచించారు.

**21) తత్రైవ చక్రే పరపక్షభఙ్గం రమ్యం విచిత్రం రఘువీరగద్యమ్,**
**స్తోత్రఞ్చ యో గోపపతేరవోచత్ తం వేఙ్కటేశం శరణం ప్రపద్యే**

ఆ దివ్య దేశంలోని భగవానునకు మాఘమాసంలో ఉత్సవం జరిగేటప్పుడు వేదాంత దేశికులకు జైనులు మొదలైన 18 మంది ఇతర మతాలవారితో వాదించ వలసి వచ్చింది. అప్పుడు వేదాంత దేశికులు దేవ నాయక స్వామి సన్నిధిలోనే ఆ స్వామి అనుగ్రహంతో ఇతర మతాలను అన్నిటిని ఖండించారు. ఆ విధానాన్ని పరమత భంగం అనే పేరుతో ఒక అందమైన ద్రావిడ ప్రబంధంగా రచించారు. తరువాత, శ్రీరాముని వైభవాన్ని తెలిపే అందమైన, ఆశ్చర్యకరమైన గద్య ప్రబంధాన్ని, రుక్మిణీ సమేత శ్రీ కృష్ణ పరమాత్మ వైభవాన్ని వర్ణించే గోపాల వింశతి అనే స్తోత్రాన్ని రచించారు. అటువంటి వేదాంత దేశికులను నేను శరణు పొందుతున్నాను.

**22) నాగేన్ద్రపుర్యాం స్వయమేవ ఖాత్వా ప్రహిం ప్రశస్తాం తదభిజ్ఞమాన్యః,**
**యః సర్వ తన్త్రేషు ధురన్ధరత్వం ప్రఖ్యాపయామాస గురుం తమీడే**

తిరువహింద్ర పురంలో ఒక సమయంలో జరిగిన ఒక పోటీలో వేదాంత దేశికులు స్వయంగా ఒక నూతిని తవ్వి, అని తంత్రాలలో తమకు కల తన అసాధారణమైన ప్రతిభను వ్యక్తం చేశారు. అటువంటి గొప్ప ఆచార్యులను నేను నమస్కరిస్తున్నాను.

**23) తస్మాత్ గురుర్గోపపురీమవాప్య దేహళ్యధీశం శుభగైర్వచోభిః,**
**స్తుత్వా చ కాఞ్చీం ప్రవివేశ యస్తం వన్దేయ వాదిద్విరదౌఘసింహమ్**

ఆ తరువాత దేశికులు, తిరుక్కోవలూరు వేంచేసి, అక్కడ ఉండే

దేవనాయకస్వామిని దేవనాయకపంచాశత్ అనే స్తోత్రంతో స్తుతించారు. తర్వాత, కాంచీపురానికి వచ్చి ప్రతివాదులకు సింహంవంటివారై ప్రకాశించారు.

**24) క్రమేణ దేవ కమలా సహాయం ప్రణమ్య చాగత్య గురుః స్వ గేహమ్,**
**వరాం వితేనే వరదస్తుతిం యో విబావయేవేదశిరోగురుం తమ్**

ఆ తరువాత కాంచీపురానికి తిరిగివచ్చి లక్ష్మీపతి, వరప్రసాది అయిన వరదరాజ స్వామిని మంగళాశాసనం చేసి తమ గృహానికి వెళ్లారు. అక్కడ అర్చామూర్తి అయిన వరదరాజ స్వామిని కీర్తిస్తూ వరద రాజపంచాశత్ అనే స్తుతిని రచించారు. అటువంటి దేశికులకు నమస్కరిస్తున్నాను.

**25)శ్రీచిహ్నమాలాం శరణాగతేర్యో గాధాం శుభాం ద్వాదశనామ గన్ధామ్,**
**దినే విధేయమపి వైష్ణవానాం చర్యాం వితేనే శరణం భజే తమ్**

శరణాగతి మంత్ర వైభవాన్ని చక్కగా వివరించే తిరుచిన్నమాలై అనే కృతిని, శుభకరమైన పన్నిరు నామం, శ్రీ వైష్ణవ దినచరి మొదలైన ద్రావిడ గ్రంథాలను రచించారు. అటువంటి వేదాంత దేశికులను శరణు పొందుతాను.

**26) హస్తిగిరి వైభవం యో గాధారుపార్థపఞ్చకం రమ్యమ్,**
**వేఙ్కటనాథాచార్యో వ్యతనుతే తమహం విభావయే నిత్యమ్**

హస్తిగిరి మాహాత్మ్యం అనే ద్రావిడ ప్రబంధాన్ని, అందమైన అర్ధ పంచకం మొదలైన గ్రంథాలను రచించిన వేదాంత దేశికులను నేను ప్రతి దినం భావిస్తాను.

**27) శుభాం గభీరాం స్తుతిమష్టబాహోః యథోక్తకారి స్తుతిమప్యుదారామ్,**
**కామాసికామర్త్యహరేః స్తుతిఞ్చ చక్రే గురుర్యస్తమహం ప్రపద్యే**

శుభమైనది, మంచి అర్థాలను కలిగినది అయిన అష్టభుజాష్టకం అనే స్తుతిని, ఉదారమైనది, ఒక యథోక్తకారిస్వామిని కీర్తించేది అయిన వేగాసేతుస్తోత్రాన్ని, మన సంసారం అనే ఆశను ఖండించే కత్తి వంటి నరసింహస్వామి స్తుతించే కామాసికాష్టకాన్ని రచించారు. ఆ ఆచార్యశేఖరులను నేను శరణు పొందుతున్నాను.

**28) దీపప్రకాశస్తుతి దీపభాసా దూరీకృతో యోన హృదన్ధకారః**
**అస్మాకమామ్నాయశిరోగురుం తమాదిత్యవర్ణం భజతాం మనో మే**

మన హృదయంలో ఉండే అజ్ఞానమనే చీకటిని పోగొట్టేది, తిరుత్తణ్ కా అనే దివ్యదేశంలో వేంచేసి ఉండేవాడు, శ్రీ మరకతవల్లి సమేతుడైన దీప ప్రకాశ

స్వామిని స్తుతించేది అయిన శరణాగతి దీపికా అనే స్తోత్రాన్ని రచించినవారు, సూర్యునివలె గొప్ప తేజస్సుతో వెలిగేవారైన వేదాంత దేశికులను - ఓ నా మనసా, స్తుతించు .

**29) సమరప్లవస్తుతిమద్భుతాం అకృత యో భువి వేఙ్కటదేశికః,**
**శమదమాదిగుణైకవిభూషణం కవిమృగేన్ద్రగురుం కలయామి తమ్**

కాంచీపురానికి సమీపంలోని తిరుప్పుట్కు్ళి అనే దివ్యదేశంలో వేంచెసి ఉండే సమర పుంగవుడు అనే శ్రీరామచంద్రమూర్తిని సుతించే అద్భుతమైన పరమార్ధ స్తుతిని అనుగ్రహించినవారు, శమదమాదిగుణాలను అలంకారంగా కలవారైన కవితార్కిక సింహులు వేదాంత దేశికులను నేను భావిస్తున్నాను.

**30) హేతిరాజవిషయాం స్తుతిం వ్యధాత్**
**తస్యహేతి విషయం స్తుతిం చ యః,**
**సాదువృన్దవినుతం తమాశ్రయే**
**వేదమౌళియుగదేశికోత్తమమ్**

ఆ దివ్య దేశంలోని సుదర్శన స్వామిని గూర్చిన సుదర్శనాష్టకం అనే స్తుతిని, షోడశాయుధ స్తోత్రాన్ని వేదాంత దేశికులు రచించారు. సత్పురుషులు స్తుతించే ఆ వేదాంత దేశికులను నేను స్తుతిస్తున్నాను.

**31) కాలే గురుః ప్రణిపతన్ కరిశైలనాథం**
**కాఞ్చీపురే సుఖమువాస కవీడితో యః,**
**సద్భ్యః సదా ప్రకటయన్ సకలార్థజాతం**
**తం వేఙ్కటేశ గురువర్యమహం ప్రపద్యే**

కరిగిరి నాథుడైన వరదరాజస్వామిని సదా సేవిస్తూ, శిష్యులకు సకలవిధ తత్వార్థాలను ఎల్లప్పుడూ వివరిస్తూ కంచిలో సుఖంగా వేంచేసి ఉన్న వేదాంత దేశికులను నేను శరణం పొందుతున్నాను.

**32) నిష్క్రమ్య కాఞ్చీనగరాత్ కదాచిత్ శిష్యః శుభాచారయుతైస్సుధీభిః,**
**శ్రీవేఙ్కటేశ్వరక్ష్మాభృతమాప యస్తం సేవే త్రయీశేఖర దేశికేన్ద్రమ్**

ఒకానొక సమయంలో కాంచీనగరంనుండి మంచి ఆచారాన్ని కలిగినవారై ప్రకాశించే జ్ఞానులైన శిష్యులతో కలసి, తిరుమలలోని వేంకటేశ్వరుని సేవించడం కోసం వెళ్లారు. అటువంటి ఆ దేశికులను నేను సేవిస్తున్నాను.

**33) స్నాత్వా సమ్యక్ సహ బుధవరైస్స్వామినః పుష్కరిణ్యాం**
**ధృత్వా వస్త్రద్వయమథవరానూర్ధ్వపుండ్రాన్ దధానః,**
**శ్రీశం దేవం వృషగిరిపతిం ప్రాణమద్యో వినీతః**
**త్రయ్యన్తార్యం కవికరిఘటాపఞ్చవక్త్రం భజేఽహమ్**

విద్వాంసులైన తన శిష్యులతో కలసి బయలుదేరిన దేశికులు తిరుమల కొండపై గల స్వామి పుష్కరిణిలో స్నానం చేసి, చక్కని వస్త్రద్వయాన్ని ధరించి, చక్కని ఊర్ధ్వ పుండ్రాలను ధరించి, శ్రీ వేంకటేశ్వరుని నమస్కరించారు. అటువంటి వేదాంత దేశికులను నేను భజిస్తున్నాను.

**34) పాదాది కేశం ప్రణిపత్య సమ్యక్ శ్రీవేఙ్కటేశం శ్రితపారిజాతమ్,**
**ప్రీతేన దేవేన కృపాకటాక్షైః కటాక్షితో యస్తమహం భజామి**

భక్తులకు కల్పవృక్షంవంటివాడైన ఆ శ్రీవేంకటేశ్వరుని పాదాది కేశంగా దర్శించిన దేశికులు ఆ స్వామికి నమస్కరించారు. అప్పుడు చాలా సంతోషించిన వేంకటేశ్వరుడు వారిని చల్లగా కటాక్షించాడు. అటువంటి వేదాంత దేశికులను నేను భజిస్తున్నాను.

**35) శ్రేయో జనానాముపపాదయిష్యన్శ్రీవేఙ్కటాధీశ దయాస్తుతిమ్ యః,**
**దివ్యాం దయావారినిధిర్వితేనే తం వేఙ్కటేశం ప్రణమామ్యభీక్ష్ణమ్**

లోకంలోనివారికి మంచిని కలిగించగోరిన శ్రీ వేదాంత దేశికులు శ్రీ వేంకటేశ్వర స్వామి దయాగుణాన్ని కీర్తించే, దివ్యమైన, దయా శతకం అనే పేరు కలిగిన స్తుతిని రచించారు. అటువంటి దేశికులను నేను సదా నమస్కరిస్తున్నాను.

**36) తత్ర స్థితానాం విదుషాం హితార్థాన్ ఉపాదిశద్యః కవివాదిసింహః,**
**తం ఖ్యాతిపూజావిముఖం దయాళుం త్రయీశిరోదేశికవర్యమీడే**

కవితార్కిక సింహులైన వేదాంత దేశికులు ఆ దివ్య దేశంలో ఉండే విద్వాంసుల క్షేమంకోసం తత్త్వ హితార్థాలను ఉపదేశించారు. దయను కలిగినవారు, కీర్తి పట్ల, ప్రశంస పట్ల ఏ మాత్రం కోరిక లేనివారైన ఆ వేదాంత దేశికులను శరణు పొందుతున్నాను.

**37) స్థానాని విష్ణోస్తత ఔత్తరాణి గత్వా గురుర్యః ప్రణిపత్య సమ్యక్,**
**తత్రత్య సత్త్వస్థ జనాన్ సమీక్ష్య తేషాం హితార్థానవదత్తమీడే**

ఆ తరువాత వేదాంత దేశికులు ఉత్తరభారతంలో గల విష్ణుస్థలాలను సేవించి, అక్కడ నెలకొని ఉండే అర్చామూర్తులను కొలిచి, అక్కడ నివసిస్తున్న మహాపురుషులతో కలసి, వారికి తత్త్వహితార్థాలను ఉపదేశించారు. అటువంటి వేదాంత దేశికులను నమస్కరిస్తున్నాను.

**38) రమ్యాణ్యయోధ్యా ప్రభృతీనివిష్ణోః**
**స్థానాని కాఞ్చ్యా న సమాని భూమ్యామ్,**
**ఇత్యుచ్చరన్ యః పునరేవ కాఞ్చీం**
**భేజే భజే తం పరవాది సింహమ్**

భగవానుడు వేంచేసి ఉండే అయోధ్య మొదలైన దివ్య దేశాలు అందమైనవి అయినా, అవి భూమిలో కంచితో సమానం కావు-అని అనుకుంటూ వేదాంత దేశికులు తిరిగి కాంచీపురాన్ని చేరారు. అటువంటి దేశికులను నేను భజిస్తున్నాను.

**39) కవితార్కికకేసరిణా కాఞ్చ్యాం వసతా కుదృషటి సన్యాసీ,**
**వాదేవినిరితోஉభూద్యేవ తమీడే త్రయీశిరస్సూరిమ్**

వేదాంత దేశికులు కాంచీపురంలో వేంచేసి ఉండే సమయంలో వారితో ఒక కుదృష్టి సన్యాసి వాదించడానికి వచ్చాడు. అతనిని దేశికులు పూర్తిగా ఓడించారు. అటువంటి వేదాంత దేశికులను నేను కీర్తిస్తున్నాను.

**40) ద్రోహం చికీర్షురస్మై మహోదరత్వప్రదం పపౌ సోమ్బుః,**
**తజ్జ్ఞో గురురపి విదధే స్తమ్భోచ్ఛిద్రం యథా స్రవేదమ్బుః**

ఆ సమయంలో దేశికులతో వాదించడానికి వచ్చిన ఆ సన్యాసి వారికి అపకారం చేయాలని తలచాడు. దేశికుల కడుపు ఉబ్బిపోయేటట్లుగా మంత్రాన్ని ప్రయోగించి తాను నీటిని తాగడం ఆరంభించాడు. ఆ కారణంగా దేశికుల ఉదరం నిండి పోయింది. అతడు చేసే కుట్రను గమనించిన దేశికులు దగ్గరలో ఉండే ఒక స్తంభంలోకి తన కడుపులోని నీరు ప్రవేశించేటట్లు చేసి, ఆ స్తంభం దగ్గరకు వెళ్ళి తమ గోటితో ఆ స్తంభాన్ని గీరారు. వెంటనే ఆ స్తంభం నుండి నీరు బయటకు వచ్చింది. అటువంటి వేదాంత దేశికులను నేను ఆశ్రయిస్తున్నాను.

**41)సమ్యక్ త్వా వైభవం తస్య సూరేః సత్కారార్థం పత్రికాం ప్రీతియుక్తః,**
**విద్యారణ్యః ప్రేషయామాస యస్మై త్రయ్యన్తార్థం సన్తతం భావయే యమ్**

విద్యారణ్యులు దేశికులవారికి బాల్య మిత్రులు. విజయనగర ప్రభువు వద్ద రాజ గురువుగా ఉండేవారు. దేశికుల వైభవాన్ని విని వారిని సత్కరించడం కోసం ఆహ్వాన పత్రికను పంపించారు. అటువంటి దేశికులను నేను సదా భావిస్తాను.

**42) శీలం కి మిత్యాదిముఖాన్ గురుర్యః**
**శ్లోకాన్ శుభాన్ ప్రేషయతి స్మ తస్మై,**
**ధనే విరక్తం తృణతుల్య భూపం**
**త్రయ్యన్తసూరిం శరణం ప్రపద్యే**

అప్పుడు దేశికులు "సిలం కిమనలమ్" ఇత్యాదిగా అద్భుతమైన ఐదు శ్లోకాలను రచించడంద్వారా తమ వైరాగ్యాన్ని ప్రకటిస్తూ వానిని విద్యారణ్యులకు సమాధానంగా పంపించారు. ఆ విధంగా ధనం పట్ల విరక్తులు, రాజ గౌరవాన్ని కూడా తృణప్రాయంగా భావించినవారైన దేశికులను నేను శరణు పొందుతున్నాను.

**43) విద్యారణ్యో వివిధం వేఙ్కటసూరే ర్విశోధ్య వైరాగ్యమ్,**
**యం విష్ణోరవతారం మేనే సేవే తమాగమాన్తగురుమ్**

విద్యారణ్యులు దేశికుల వైరాగ్యాన్ని పలు విధాలుగా శోధించి చూచారు. వారి గొప్ప వైరాగ్యాన్ని గమనించి ఆశ్చర్యపడి, వారిని విష్ణువు యొక్క అవతారంగా భావించారు. అటువంటి నిగమాంత గురువును నేను సేవిస్తున్నాను.

**44) శ్రీర్గనోః శాసనం సూరివర్యైః యస్మై శీఘ్రం ప్రేషితం వాదిరోధే,**
**తస్మై భక్తిం కుర్వతే యో నరాస్తాన్ధన్యాన్ సేవే సంస్తువే చిన్తయామి**

ఒకానొక సమయంలో భగవద్రామానుజ సిద్ధాంతాన్ని ఎదిరించడానికి వచ్చిన పరమత వాదులను ఓడించడంకోసం శ్రీరంగనాథుడు దేశికులను శ్రీరంగానికి తీసుకుని రావలసినదిగా అక్కడ ఉండే విద్వాంసులను ఆజ్ఞాపించాడు. వారు కూడా ఆ విధంగానే కాంచీపురం లో ఉండే వేదాంత దేశికులను శ్రీరంగానికి ఆహ్వానించారు. అటువంటి మహానుభావులైన దేశికులను నేను సేవిస్తాను.

**45) రఙ్గపతి శాసనం యో ధృత్వా శిరసా తదైవ గురువర్యః,**
**రఙ్గం ప్రతిప్రతస్థే రమ్యగుణం తం నిరన్తంరం సేవే**

శ్రీరంగనాథుని శాసనాన్ని శిరసావహించిన వేదాంత దేశికులు వెంటనే శ్రీరంగానికి బయలుదేరి వెళ్లారు. ఆకర్షణీయమైన గుణాలు కలిగిన వారు, గురువర్యులు అయిన ఆ వేదాంత దేశికులను నేను నిరంతరం సేవిస్తాను.

**46) శ్రీరఙ్గమాసాద్య తతః సురమ్యం కవేరజాయామవగాహ్య సమ్యక్,**
**దధౌ గురుర్యో వసనం మనోజ్ఞం దివ్యోర్ధ్వపుణ్డ్రానపి తం భజామి**

అందమైన శ్రీరంగానికి చేరిన తరువాత వేదాంత దేశికులు కావేరీ నదిలో స్నానం చేసి శుభ్రమైన వస్త్రాలను ధరించారు. ఆ విధంగానే దివ్యమైన ఊర్ధ్వపుండ్రాలను ధరించారు అటువంటి వేదాంత దేశికులను నేను సేవిస్తున్నాను.

**47) సేవాక్రమేణ ప్రణిపత్య దేవం శ్రీరఙ్గనాథం కమలాసహాయమ్,**
**తద్ధ్యానసోపానమువాచ యస్తం త్రయ్యన్తసూరి సతతం స్మరామి**

దేవుడైన శ్రీ రంగనాయక సమేత శ్రీరంగనాథుని దేశికులు క్రమానుసారంగా సేవించారు. ఆ సమయంలో తాము శ్రీ రంగనాథుని దివ్య మంగళ రూపాన్ని ఆపాదమస్తకంగా సేవించిన క్రమాన్ని వర్ణిస్తూ భగవద్ధ్యాన సోపానం అనే స్తుతిని దేశికులు రచించారు. అటువంటి వేదాంత దేశికులను నేను సదా స్మరిస్తూ ఉంటాను.

**48) రఙ్గాధిరాజేన కృపా కటాక్షైః కటాక్షితో యః కవివాది సింహః,**
**జిత్వా తదా వాదినమాగమాన్తగురుర్వ్యతేనే శతదీషణీం యః**

కవి తార్కిక సింహులైన వేదాంత దేశికులను శ్రీరంగనాథుడు తన కృపాకటాక్షాలతో అనుగ్రహించాడు. తరువాత పండితులు అందరితో కలసి దేశికులు తమ స్థానానికి చేరారు. అటువంటి దేశిక సార్వభౌములను నేను ఆశ్రయిస్తున్నాను.

**49) తన్నామసఙ్కీర్తనతత్పరాంస్తాన్ సమాశ్రయే సర్వజనాహివూజ్యాన్**

ఆ సమయంలో తాము ప్రతివాదితో వాదించి అతనిని గెలిచిన ప్రకారాన్ని శత దూషణి అనే గ్రంథ రూపంలో దేశికులు వెలయించారు. అటువంటి మహనీయులైన దేశికుల నామాన్ని కీర్తనం చేయడంలో ఆసక్తిని కలవారు, సర్వజనులకు పూజ్యులైన మహనీయులను నేను ఆశ్రయిస్తున్నాను.

**50) ప్రీతేన రఙ్గపతినా బహుమానపూర్వం**
**వేదాన్తయుగ్మ మనిశం ప్రతిపాదయానః,**
**అత్రైవ సౌమ్య వస నిత్యమితీరితో యః**
**తం వేదమౌలిగురుమన్వహమాశ్రయామి**

అప్పుడు చాలా సంతోషించిన శ్రీరంగనాథుడు దేశికులను గొప్పగా సన్మానించి, వారితో ఈ విధంగా అన్నాడు. "ఈ విధంగానే మీరు సదా ఉభయ

వేదాంతాలను ప్రచారం చేస్తూ, ఈ శ్రీరంగంలోనే నిత్యం వాసం చెయ్యండి". ఆ విధంగా శ్రీరంగనాథునిచే అనుగ్రహింపబడిన వేదాంత దేశికులను నేను సదా ఆశ్రయిస్తాను.

51) **రఙ్గశస్య పదామ్బుజం ప్రణిపతన్ ధృత్వా తదాజ్ఞాం శుభామ్,**
**త్రయ్యన్తద్వయమేవ సర్వవిదుషాం సమ్యగ్వదన్నాదరాత్,**
**కఞ్చిత్కాలమువాస రఙ్గేనగరే యో వేఙ్కటార్యః సుధీః**
**తం వాదిద్విరదౌఘసింహమనఘం భక్త్యా ప్రపద్యేఽన్వహమ్**

శ్రీరంగనాథుని ఆజ్ఞను శిరసావహించిన దేశికులు ఆ స్వామి పాదపద్మాలను సేవిస్తూ, శ్రీరంగంలోనే కొంతకాలం నివసించి అక్కడ ఉండే పండితులకు ఉభయ వేదాంతాలను అనుగ్రహించారు. ఆ విధంగా శ్రీరంగనాథుని ఆజ్ఞను అనుసరించి శ్రీరంగంలో వేంచేసి ఉన్నవారు, కవితార్కిక సింహులైన వేదాంత దేశికులను నేను నిత్యం ఆశ్రయిస్తున్నాను.

52) **ప్రఖ్యాపయన్ నిగమమౌళియుగమ బుధానాం**
**తద్రక్షణాయవివిధాః కరు సత్కృతీస్త్వమ్,**
**ఇత్యుక్తవాన్ యతిపతిర్గురవే తు యస్మై**
**స్వప్నే తమద్భుతగుణం శరణం ప్రపద్యే**

దేశికులకు శ్రీ రామానుజులు కలలో సాక్షాత్కరించి "ఉభయ వేదాంతాలను పండితులకు అనుగ్రహిస్తూ వాటి రక్షణకోసం మీరు పలు గ్రంథాలను రచించండి" అని ఆదేశించారు. అటువంటి, అద్భుతమైన గుణాలు కలిగినవారైన దేశికులను నేను శరణు పొందుతున్నాను.

53) **రఙ్గపతినా సభాయాం దృష్ట్వా వ్యాఖ్యానకౌశలం సూరేః,**
**వేదశిరో దేశికతా దత్తా యస్మై తమాశ్రయే నిత్యమ్**

పండితసభలో వేదాంత దేశికుల వ్యాఖ్యాన సామర్థ్యాన్ని చూచిన శ్రీరంగనాథుడు వారికి "వేదాంతాచార్యులు" అనే బిరుదాన్ని అనుగ్రహించాడు. అటువంటి వేదాంత దేశికులను నేను నిత్యం ఆశ్రయిస్తున్నాను.

54) **తత్ప్రేయస్యా సర్వతన్త్రేషు దాక్ష్యం**
**దత్తం యస్మై ప్రీతాయ దేశికాయ,**
**తస్మై భక్త్యా కుర్వతే యే తు సేవాం**
**లతద్దాసానాం దాస్యమభ్యర్థయేఽహమ్**

దేశికులకు అన్ని శాస్త్రాలలో కల సాటిలేని సామర్థ్యాన్ని చూచిన శ్రీరంగనాయకి వారికి “సర్వ తంత్ర స్వతంత్రులు “ అనే బిరుదాన్ని అనుగ్రహించింది. అటువంటి వేదాంత దేశికులను ఆరాధించేవారిని ఎవరు భక్తితో సేవిస్తారో, వారి దాసులకు సదా సేవను చేయాలని నేను కోరుకుంటున్నాను.

**55) సకలకుశలహేతోఃసద్భిరభ్యర్థ్యమానం**
**సరసిజనిలయాయాః స్తోత్రముర్వ్యాశ్చ దేవ్యాః,**
**వ్యతనుత మధురార్థం వేఙ్కటేశో గురుర్యః**
**శమదమగుణభూషం తం శరణ్యం భజేఽహమ్**

అందరికీ క్షేమం కలగడంకోసం పెద్దలచే ప్రార్థింపబడిన వేదాంత దేశికులు మధురమైన అర్థాలను కలిగిన శ్రీ స్తుతిని, భూస్తుతిని అనుగ్రహించారు. శమం దమం మొదలైన సద్గుణాలను ఆభరణాలుగా కలిగినవారు, శరణ్యులైన వేదాంత దేశికులను నేను భజిస్తున్నాను.

**56) గోదాస్తుతిం గుణాఢ్యాం విదుషాం ప్రీత్యై వినిర్మమే యస్తామ్,**
**వేదాన్తసూరివర్యం వేఙ్కటనాథం విభావయే నిత్యమ్**

పండితుల ప్రీతికోసం వేదాంత దేశికులు గొప్ప కావ్యగుణాలతో నిండిన గోదాస్తుతిని రచించారు. అటువంటివారు, వేంకట నాథులనే పేరు గల వేదాంత దేశికులను నిత్యం స్మరిస్తున్నాను.

**57) దశావతారస్తుతిమద్భుతాం యో దివ్యాం గభీరం జనరక్షణార్థమ్,**
**వినిర్మమే వేఙ్కటనాథవర్యః తం సర్వ విద్యా జలధిం భజేఽహమ్**

అద్భుతమైనది, దివ్యమైనది, గంభీరమైనది అయిన దశావతార స్తుతిని జనుల రక్షణ కోసం వేదాంత దేశికులు రచించారు. సర్వ విద్యలకు సముద్రంవంటి వారైనా ఆ వేదాంత దేశికులను నేను భజిస్తున్నాను.

**58) శమధనైర్విబుధైర్ముహురర్థితః సకలతన్త్రదురన్ధరదేశికః,**
**యతిపురన్దరసప్తతిమాదరాత్ అకృత యస్తమహం శరణం భజే**

శమదమాది గుణాలను కలిగిన పెద్దలచే మాటిమాటికి ప్రార్థింపబడినవారు, సకల విద్యలలో గొప్పవారైన దేశికులు యతిరాజసప్తతి అనే స్తోత్రాన్ని ఆదరంగా రచించారు. అటువంటి వేదాంత దేశికులను నేను శరణు పొందుతున్నాను.

**59) విమలగుణవిశిష్టం వీతదోషం విచిత్రం
సహృదయహృది ధార్యం తత్త్వ ముక్తాకలాపమ్,
సకలకుశలహేతుం సర్వతన్త్ర స్వతన్త్రః
సమతనుతగురుర్యస్తం భజే సాధుసేవ్యమ్**

అన్ని విద్యలలో సమర్థులైన వేదాంత దేశికులు విమల గుణ విశిష్టమైనది, ఏ దోషం లేనిది, విచిత్రమైనది, సహృదయులైన పెద్దలచే హృదయంలో ధరించ తగినది అయిన తత్వముక్తాకలాపం అనే గొప్ప గ్రంథాన్ని అందరి క్షేమంకోసం రచించారు. అటువంటి సదాచార్యులైన, సత్పురుషులచే సేవింపదగినవారైన వేదాంత దేశికులను నేను భజిస్తున్నాను.

**60) సర్వార్థసిద్ధిహేతుం సర్వజ్ఞో యః సమస్తజీవానామ్,
సర్వార్థసిద్ధిమనఘాం చక్రే యస్తం సమాశ్రయే సతతమ్**

జీవుల అందరికి సమస్త అర్థాలు సిద్ధించడంకోసం సర్వజ్ఞులైన వేదాంత దేశికులు సర్వార్థ సిద్ధి అనే గొప్ప గ్రంథాన్ని రచించారు. అటువంటి వేదాంత దేశికులను నేను నిత్యం ఆశ్రయిస్తున్నాను.

**61) తత్త్వాలోకానసాధనం తనుభృతాం సన్నీతిసిద్ధాఞ్జనమ్
చక్రే యః కవివాది పఞ్చవదనస్తం వేదచూడగురుమ్,
యే కేచిన్మనుజా భజన్తి భువనే తేషామహం ధీమతాం
వీథీచేథ ఇతి ప్రహృష్టమనసా వీథీషు సఙ్ఘుష్యతామ్**

ప్రకృతి, జీవుడు, ఈశ్వరుడు-అనే మూడు తత్వాల స్వరూపాన్ని జీవులు స్పష్టంగా దర్శించడానికి సాధనమైనది అయిన న్యాయ సిద్ధాంజనం అనే గ్రంథాన్ని రచించిన వేదాంత దేశికులను ఎవరు ధ్యానిస్తారో, అటువంటి బుద్ధిమంతుల గోష్ఠికి నేను దాసుడను-అని సంతోషంగా వీథిలో ఎలుగెత్తి పలుకుతాను.

**62) నిగమశిఖరానురోధాన్నీతేఃశుద్ధిర్వినిర్మితాగురుణా,
కవికథక పఞ్చవక్త్రం కలయే కరుణామహోదధిం తమహమ్**

వేదాంత శాస్త్రానికి అనుగుణంగా సంప్రదాయ పరిశుద్ధి అనే గొప్ప గ్రంథాన్ని రచించినవారు, దయాసముద్రులు, కవి తార్కిక సింహులైన వేదాంత దేశికులను మనసులో భావిస్తాను.

**63) యో మీమాంసాం సేశ్వరాం వ్యాజహార**
**తస్యా రమ్యాం పాదుకాం వేఙ్కటార్యః,**
**సద్భిస్సేవ్యాం తత్త్వటీకాం చ చక్రే**
**తత్పాదాబ్జం సన్తతం చిన్తయామి**

సజ్జనులు సేవించదగిన సేశ్వర మీమాంస అనే గ్రంథాన్ని, మీమాంసా పాదుకా అనే గ్రంథాన్ని, తత్త్వటీక అనే గ్రంథాన్ని వేదాంత దేశికులు రచించారు. అటువంటి వేదాంత దేశికుల పాదపద్మాలను నిత్యం భావిస్తాను.

**64) అధికరణ దర్పణం యో వ్యతనుత విమలం విపశ్చితాం ప్రీత్యై,**
**వేఙ్కటనాథముపాసే విబుధవరం తం విచిత్ర శక్తియుతమ్**

పండితుల ఆనందం కోసం దేశికులు అధికరణ దర్పణం అనే గ్రంథాన్ని రచించారు. అటువంటివారు, విచిత్రమైన శక్తిని కలవారు, పండితులలో గొప్పవారైన వేదాంత దేశికులను నేను భావిస్తున్నాను.

**65) సంసారసన్తాపవిషణ్ణజన్తూన్ సమీక్ష్య సర్వాన్ కృపయా గురుర్యః**
**చకార సారావళిదుగ్ధరాశిం తత్పాదపద్మం జతాం మనో మే,**
**కుమతి తమో జాలం యో హర్తుం తాత్పర్యచన్ద్రికాం చక్రే**
**విష్ణుపదసంశ్రయం తం వేఙ్కటచన్ద్రం కలానిధిం కలయే**

తగని మతాలవల్ల ఏర్పడిన అజ్ఞానాన్ని తీర్చడం కోసం భగవద్రామానుజుల గీతా భాష్యానికి తాత్పర్య చంద్రిక అనే గొప్ప వ్యాఖ్యానాన్ని రచించారు. విష్ణుపాదాలను ఆశ్రయించినవారు, అన్ని కళలకు నిధి, చంద్రుని వంటివారైన ఆ దేశికులను నేను భజిస్తున్నాను.

**66) హృదయఙ్గమా బుధానాం ఈశావాస్య త్రయీ శిరో వ్యాఖ్యా,**
**విహితా యేన భజే తం వేఙ్కటనాథం విపశ్చితాం ప్రవరమ్**

పండితులకు ఆనందం కలిగించే వ్యాఖ్యానాన్ని ఈశావాస్యోపనిషత్తుకు దేశికులు రచించినవారు, పండితులలో గొప్పవారైన వేదాంత దేశికులను నేను భజిస్తున్నాను.

**67) గమ్భీరాం యః పఞ్చకాలవ్యవస్థా**
**హేతుం చక్రే పఞ్చరాత్రస్య రక్షామ్,**
**కుర్వాణం తం ప్చకాలక్రమార్చాం**
**సేవేసూరి ష్టవక్త్రం కవీనాఞ్ం**

భగవానుని పంచకాలాలలో ఆరాధించే క్రమాన్ని వివరించే పాంచరాత్రరక్ష అనే గంభీరమైన గ్రంథాన్ని దేశికులు రచించారు. భగవానుని పంచకాలారాధన క్రమంలో ఆరాధించేవారు, కవులలో సింహం వంటివారైన వేదాంత దేశికులును నేను సేవిస్తున్నాను.

**69) యామునమునినా రచితం గీతాసారం గమ్భీరరమణాయమ్**
**వ్యాచష్ట వేఙ్కటార్యో విమలమతిం తం విపశ్చితం కలయే**

శ్రీ యమున మునులు రచించిన గీతార్థ సంగ్రహం అనే పేరు కల, గీతా సారాన్ని వివరించే గ్రంథానికి అందమైన వ్యాఖ్యానాన్ని గీతార్థ సంగ్రహం అనే పేరుతో వేదాంత దేశికులు రచించారు. పరిశుద్ధమైన మనస్సును కలవారు, పండితులలో గొప్పవారైన ఆ దేశికులను నేను భావిస్తున్నాను.

**70) కుమతిజనకుయుక్త్యా క్లృప్తముర్వ్యాం కృపాళుః**
**శమయితుముపరోధం శఙ్ఖచక్రాఙ్కనాద్యైః**
**సకలజనమనోజ్ఞాం సచ్చరిత్రస్య రక్షాం**
**వ్యతనుతగురువర్యో యస్తమీడే కవీన్ద్రమ్**

కుమతులు వాదించే తగని వాదాలవల్ల, యుక్తుల వల్ల తప్తచక్రాంకన క్రమానికి ఏర్పడిన అవరోధాలను తీర్చడంకోసం దయాళువైన వేదాంత దేశికులు అందరికి మనోజ్ఞమైన సచ్చరిత్రరక్ష అనే గ్రంథాన్ని రచించారు. కవులలో గొప్పవారైన ఆ వేదాంత దేశికులను నేను స్తుతిస్తున్నాను.

**71)బాహ్యాన్తరఙ్గచోరైః బాధాం జాతాం నివర్త్య బుధావర్యః,**
**నిక్షేపస్య సమగ్రాం రక్షాం చక్రే నమామి తం నిత్యమ్**

**72)రక్షాం సమగ్రాం విదుషాం విధాతుం రక్షాం రహస్యస్యవినిర్మమే యః,**
**వాదిహేసామ్బుదసూరిశిష్యం వన్దే గురుం వాదికవీన్ద్రసింహమ్**

జనులందరి సమగ్రమైన రక్షణ కోసం వేదాంత దేశికులు తిరుమంత్రం, ద్వయం, చరమ శ్లోకం అనే 3 రహస్యాల అర్థాలను వివరించే పలు రహస్య గ్రంథాలను రచించారు. ఆత్రేయ రామానుజాచార్యులవారి శిష్యులు, కవివాది సింహులైన వేదాంత దేశికులకు నేను నమస్కరిస్తున్నాను.

**73) న్యాసతిలకం వితేనే రఙ్గనరేన్ద్ర ప్రియావహం రమ్యమ్,**
**తస్య దశకం చ యస్తం త్రయ్యన్తార్యం సమాశ్రయే సతతమ్**

శ్రీ రంగనాథునకు ఆనందాన్ని కలిగించే న్యాసతిలకం, న్యాస దశకం అనే గ్రంథాలను దేశికులు రచించిన వేదాంత దేశికులను నేను సదా ఆశ్రయిస్తున్నాను.

**74) వివృతో వేఙ్కటవిదుషా వింశత్యా యేన విధివిదాన్యాసః,**
**తత్పాదపద్మవిముఖా రావణచైద్యానుసారిణో మనుజాః**

శరణాగతి విద్యారహస్యాన్ని తెలిసిన వేదాంత దేశికులు న్యాస వింశతి అనే స్తుతిని రచించి, దానికి చక్కని వ్యాఖ్యానాన్ని కూడా రచించారు. అటువంటి వేదాంత దేశికుల పాదపద్మాల విషయంలో విముఖులైన మానవులు రావణ శిశుపాలాదులను అనుసరించినవారే.

**75) భూమ్యామానమవోచద్బుధజనహృదయం బుధాధిపః సూరిః,**
**తద్వివృతిం చ వితేనే యస్తం వన్దే యతీన్ద్రపదభక్తమ్**

పండితులు మెచ్చే విధంగా ఈ భూమియొక్క గొప్పతనాన్ని వివరిస్తూ దేశికులు భూ గోళ నిర్ణయం అనే గ్రంథాన్ని రచించారు. శ్రీరామానుజుల పదభక్తులైన ఆ దేశికులను నేను నమస్కరిస్తున్నాను.

**76) యతిపతిఫణతీనాం భావమేవం వివృణ్వన్**
**జయతునిగమచూడాదేశికేన్ద్రో దయాళుః,**
**ఇతి విబుధవరైర్యః సమ్యగభ్యర్థితస్తం**
**శరణమశరణోఽహం సంశ్రయే సాధువన్ద్యమ్**

శ్రీరామానుజుల సూక్తులలోని భావాలను ఈ విధంగా వివరిస్తూ దయాళు వైన వేదాంత దేశికులు ఈ భూమిలో దేశికులు సదా వర్ధిల్లాలి-అని పండితులచే ఆశాసింపబడినవారు, సాధుజనులకు నమస్కరించదగినవారైన వేదాంత దేశికులను వేరే ఏ శరణం లేనివాడనై నేను శరణంగా ఆశ్రయిస్తున్నాను.

**77) కదాచిదక్షోభ్య మునేశ్చ విద్యారణ్యస్య**
**జాతం బహుళం వివాదమ్,**
**విలిఖ్య భూపో విబుధాయ యస్మై**
**సమ్ప్రేషయామాస తమాశ్రయేఽహమ్**

ఒకానొక సమయంలో విద్యారణ్యులకు, అక్షోభ్య మునికి మధ్య జరిగిన పెద్ద వాదాన్నిప్రభువు కోరికమేరకు గమనించి, దానికి న్యాయనిర్ణేతగా వర్తించిన దేశికులు తమ నిర్ణయాన్ని లిఖించి తెలిపారు. అటువంటి వేదాంత దేశికులను నేను

ఆశ్రయిస్తున్నాను.

**78) తత్త్వమసినా ఽసినా తంవిద్యారణ్యం మునిస్తదాఽక్షోభ్యః,**
**అచ్ఛినదిత్యవదద్యః తం సేవే తత్త్వనిర్ణయే చతురమ్**

"అసినా తత్త్వమసినా పరజీవప్రభేదినా, విద్యారణ్యమహారణ్య మక్షోభ్యముని రచ్ఛినత్"-జీవేశ్వరుల మధ్య భేదాన్ని తెలిపే "తత్త్వమసి" అనే వాక్యమనే కత్తితో అక్షోభ్యముని విద్యారణ్యుల వాదమనే మహారణ్యాన్ని ఖండించారు "- అని దేశికులు తమ నిర్ణయాన్ని వ్రాసి ప్రభువుకు పంపారు. ఆవిధంగా తత్త్వనిర్ణయంలో చతురులైన ఆ వేదాంతదేశికులను నేను సేవిస్తున్నాను.

**79) కార్యా న భాషాకృతగీతిరత్ర తత్కల్పకార్చాశ్చ న పూజనీయః,**
**ఇత్యుక్తపక్షంనృపతేస్సమక్షం యః ప్రాక్షిపత్ తం గురువర్యమీడే**

సంస్కృత భాషలో రచింపబడిన శ్లోకాలతో తప్ప, ద్రావిడ భాషలో ఆళ్వారులవంటివారు రచించిన పాశురాలను గానం చేయరాదు, వానిని రచించిన దివ్యసూరులను పూజించరాదు-అని వాదించిన కృష్ణ మిశ్రులనే పండితుని ప్రభువు సమక్షంలో వాదించి, ఆ వాదాన్ని ఖండించిన గురువర్యులు వేదాంత దేశికులను నేను నమస్కరిస్తున్నాను.

**80) జిత్వాతు తాన్ భూపసమక్షతః శ్రీరఙ్గే శ్వరస్యాధ్యయనోత్సవాదీన్,**
**ఆకల్పమవ్యాహదమాదిశద్యః తం వేదచూడం గురుమాశ్రయామి**

ప్రభువు సమక్షంలో కృష్ణ మిశ్రుని తగని వాదాన్ని ఖండించి, శ్రీ రంగనాథుని అధ్యయనోత్సవాదులు తిరిగి కల్పాంతంవరకు ఈ అడ్డు లేకుండా నిర్వహింపబడేటట్లు ఏర్పాటుచేసిన వేదాంత దేశికులను ఆశ్రయిస్తున్నాను.

**81) ఆగత్యకృష్ణమిశ్రో విజితో విబుధేన వీతదర్పోఽభూత్,**
**యేన కవిసింహగురుణాతేన సనాథావయం భృశం సుఖినః**

విద్వాంసులైన దేశికులతో వాదించడానికి వచ్చిన కృష్ణ మిశ్రుడు పరాజయం పాలయ్యాడు. అటువంటి కవివాదిసింహులైన అయిన వేదాంత దేశికులవల్ల మనం నాథులను గలవారమై చాలా సుఖంగా ఉన్నాము.

**82)సమాశ్రితానాం వవాసతేయాం సంక్షేప్తుముర్వ్యాం శ్రుతిశేఖరార్యః**
**సఙ్కల్పసూర్యోదయమదభుతం యో వినిర్మమే నిర్మమమాశ్రయే తమ్**

తమ భక్తులను సంసార సాగరంనుండి విడిపించడంకోసం వేదాంత దేశికులు అద్భుతమైన సంకల్ప సూర్యోదయం అనే గొప్ప నాటకాన్ని రచించారు. అటువంటి దేశికులను నేను ఆశ్రయిస్తున్నాను.

**83) జిత్వా కవిం డిణ్డిమసార్వభౌమం**
**కృత్వా చ కృష్ణాభ్యుదయం మనోజ్ఞమ్,**
**స్తుతస్తదా తేనగురూత్తమో యః**
**తమాశ్రయే సర్వకా స్వతన్త్రమ్**

కవిసార్వభౌముడైన డిండిమభట్టును యాదవా భ్యుదయం అనే రసవంతమైన మహాకావ్యాన్ని రచించడం ద్వారా జయించి , వేదాంత దేశికులు అతని గర్వాన్ని అణచి, అతని కవి సార్వభౌమత్వాన్ని నిర్వీర్యం చేశారు. అటువంటి గరూత్తములైన, సర్వకళా స్వతంత్రులు అయిన దేశికులను నేను ఆశ్రయిస్తున్నాను.

**84)తతో వినిష్క్రమ్య గురుర్వనాద్రిముఖ్యాని తాన్యావసథానివిష్ణోః,**
**నత్వా శఠారిం చ నిశామ్యసేతుం రఙ్గం పునర్యో౽భజదాశ్రయయే తమ్**

తరువాత వేదాంత దేశికులు శ్రీరంగం నుండి బయలుదేరి వనాద్రి (తిరుమాలిరుమ్ శోలై)మొదలైన భగవానుని దివ్య స్థలాలను సేవించి ఆల్వార్ తిరునగరి లోని నమ్మాళ్వార్లకు మంగళాశాసనం చేసి సేవించి రామసేతువును సేవించి మళ్లీ శ్రీరంగానికి చేరారు. అటువంటి దేశికులను నేను ఆశ్రయిస్తున్నాను.

**85) శ్రీకుమ్భఘోణప్రభృతీని విష్ణోః స్థానాని చోళేషు మనోహరాణి,**
**గత్వా ప్రణమ్యశ్రుతిశేఖరార్యో యః ప్రాప కాఞ్చీ నగరం భజే తమ్**

ఆ తరువాత కుంభకోణం (తిరుక్కుడంద్రై) అనే దివ్య దేశాన్ని, ఇంకా చోళదేశంలో ఉండే అందమైన దివ్య దేశాలను సేవించి, అక్కడ ఉండే అర్చా మూర్తులను మంగళాశాసనం చేసి, వేదాంత దేశికులు కాంచీనగరాన్ని చేరారు. అటువంటి దేశికులను నేను భజిస్తున్నాను.

**86) తత్ర చ కశ్చిద్ద్విజితో మన్త్రవిదా యేన సర్పసఞ్జీవీ సర్వసర్పవశీ,**
**తన్నామ చిన్తయామ యేన జనానాం ద్రవన్తి భవసర్పాః**

వేదాంత దేశికులు మంత్ర శాస్త్రంలో కూడా చాలా సమర్థులు. పాములను పట్టి జీవిస్తూ ఉండే ఒక మంత్రగాడిని వారు ఒక సందర్భంలో జయించారు.

అటువంటి దేశికుల నామాన్ని మేము స్మరిస్తున్నాము. ఆ నామ స్మరణ వల్ల సంసారమనే సర్పాలు పారిపోతాయి.

**87) విష్ణురథదణ్డకం యో వేఙ్కటనాథోవినిర్మమే రమ్యమ్,**
**వేదాన్త దేశికం తం విమలగుణాఢ్యం విభావయే హృదయే**

అందమైన గరుడ దండకం అనే స్తుతిని వేదాంత దేశికులు రచించారు. అటువంటి, ఏ దోషం లేని, గుణాలతో నిండినవారైన వేదాంత దేశికులను నేను నా మనసులో భావిస్తున్నాను.

**88) నిష్క్రమ్య దేశికేన్ద్రో ర్గం ద్రష్టుం సముత్సుకో భూయః,**
**మధ్యే తు వైశ్యశరణే న్యవసద్ యస్తం నిరన్తరం కలయే**

ఆ తరువాత మళ్లీ శ్రీ రంగాన్ని సేవించాలనే ఆశ కలిగిన వేదాంత దేశికులు కంచి నుండి బయలుదేరారు.దారి మధ్యలో కొంతకాలం ఒక వైశ్యుని ఇంటిలో నివసించారు. అటువంటి దేశికులను నేను సదా భావిస్తున్నాను.

**89) తదా నిశాయాం చణకాన్ మదీయాన్ భుఙ్క్తే వళర్క్షస్తురగస్త్వదీయః,**
**త్రైవర్ణికేనైవమితీరితో యః తమాశ్రయే సాధునుతం శరణ్యమ్**

ఒకనాడు ఆ వైశ్యుడు వేదాంత దేశికుల దగ్గరకు వచ్చి "అయ్యా! మీ గుర్రం నా శనగ చేనులోని శనగ పంటను అంతా రాత్రి వేళ తింటున్నది" అని తన బాధను నివేదించుకున్నాడు. గొప్పవారిచే స్తుతింపబడేవారు, శరణు పొందదగినవారు అయిన దేశికులను నేను ఆశ్రయిస్తున్నాను.

**90)సమర్పితం తేన పయో విశుద్ధంనివేద్య దేవాయ హయాననాయ,**
**తతః స్వయం స్వీకృతవాన్ గురుర్యః తదాఙ్ఘ్రిపాయా వయమేవ ధన్యాః**

అప్పుడు వేదాంత దేశికులు ఆ వైశ్యుని శనగ చేనులో పంటను మేసే గుర్రం సాక్షాత్తు హయగ్రీవ స్వామియే-అని తెలుసుకుని, ఆ స్వామికి శుద్ధమైన పాలను నివేదించారు. ఆ పాలను హయగ్రీవ స్వామి స్వీకరించాడు. ఆ స్వామి ఆరగించి విడిచిన పాలను తాము స్వీకరించారు. అటువంటి గొప్ప ఆచార్యులైన దేశికుల చరణాలను ఉపాయంగా కలిగినవారమై మేము ధన్యులం అయ్యాము.

**91 గత్వా రఙ్గపురీమ్ యో నత్వా రఙ్గేశమాగమాన్తార్యః,**
**స్వస్య గృహే న్యవసత్తం సతతం సేవే శఠారిపదసక్తమ్**

తరువాత దేశికులు శ్రీరంగానికి చేరి, శ్రీ రంగనాథుని సేవించి, తమ గృహంలో సుఖంగా నివసించారు. అటువంటివారు నమ్మాళ్వార్ల పాదాల పట్ల ఆసక్తి కలవారు అయిన దేశికులను సదా సేవిస్తున్నాను.

**92 సద్భిస్సాదరమర్థితః శమధనైః శ్రీమాన్ దయావారిధిః**
**తత్త్వానాం చులకం రహస్యచులకం సతాం గుప్తయే,**
**తత్త్వానాం పదవీం రహస్యపదవీరప్యద్భుతం యో విభుః**
**తం వన్దే కవివాదికుఞ్జరఘటాకణ్ఠీరవం దేశికమ్**

శమమనే గుణాన్ని ధనంగా కల మహనీయులచే ప్రార్థింపబడినవారు, దయా వారిధి అయిన వేదాంత దేశికులు తత్వచుళకం, రహస్య చుళకం అనే గ్రంథాలను, ఆ విధంగానే మంచివారి రక్షణ కోసం తత్వ పదవి రహస్య పదవి అనే అద్భుతమైన గ్రంథాలను రచించారు. అటువంటివారు, కవులు, తార్కికులు అనే ఏనుగులకు సింహంవంటివారైన దేశికులకు నేను నమస్కరిస్తున్నాను.

**93 తత్త్వ నవనీతయుక్తం నవనీతముషో రసావహం రమ్యమ్,**
**యేన గురుణా రహస్యత్రయనవనీతం కృతం భజే తమహమ్**

నవనీత చోరుడైన భగవానునకు మిక్కిలి ఆనందాన్ని కలిగించే , మధురమైన రహస్య నవనీతం, తత్వ నవనీతం అనే గ్రంథాలను వేదాంత దేశికులు రచించారు అటువంటి దేశికులను నేను భజిస్తున్నాను.

**94 చకారతత్త్వత్రయమాతృకాం యో రమ్యాం రహస్యత్రయమాతృకాం చ,**
**సఏవ మాతా చ పితా చ బన్ధుర్మిత్రం గురుర్మే సకలం చ సూరిః**

వేదాంత దేశికులు మిక్కిలి మనోహరమైన తత్త్వత్రయమాతృక, రహస్య త్రయ మాతృక అనే గ్రంథాలను రచించారు. వారే నాకు తల్లి, తండ్రి, బంధువు, మిత్రుడు గురువు, ఇంకా అన్నీ.

**95 రత్నావళిం వితేనే తత్త్వానాం యస్తమోఽపహం తస్యాః**
**వ్యాఖ్యాం చ వేఙ్కటార్యస్య కృపామేవ సంస్తువే సతతమ్**

అజ్ఞానాన్ని పోగొట్టే తత్వ రత్నావళి అనే గ్రంథాన్ని, దానికి వ్యాఖ్యానాన్ని కూడా వేదాంత దేశికులు రచించారు. అటువంటి దేశికుల దయను నేను సదా పొగుడుతాను.

96 రమ్యాం రమావల్లభనిత్యహృద్యం రహస్యరత్నావలిమప్యపూర్వమ్,
వ్యాఖ్యానరూపం హృదయం చ తస్యాః చకార యస్తం కలయే కృపాళుమ్

చాలా అందమైనది, రమావల్లభుడైన అయిన భగవానునకు చాలా ఇష్టమైనది అయిన రహస్య రత్నావళి అనే గ్రంథాన్ని, దాన్ని వ్యాఖ్యానమైన రహస్యరత్నావళీహృదయం అనే అందమైన గ్రంథాన్ని రచించారు. దయానిధి అయిన ఆచార్యులను నేను భావిస్తున్నాను.

97 త్రియుగకుహనాపోత్రీ దేవో దయామృతవారిధిః
శమితజనతాశోకం శ్లోకద్వయం యదుదాహరత్
అకృత భువితద్వ్యాఖ్యారూపం రహస్యశిఖామణిం
శమదమనిధిర్యస్తం సేవే కవీన్ద్రశిఖామణిమ్

దయకు అమృత సముద్రంవంటివాడైన ఆ వరాహ స్వామి పూర్వం తన భక్తుల శోకాన్ని తీర్చడం కోసం వరాహచరమశ్లోకాలను పలికాడు. వేదాంత దేశికులు ఆ రెండు శ్లోకాలకు చక్కని వ్యాఖ్యానాన్ని రహస్య శిఖామణి అనే పేరుతో రచించారు. శమం, దమం మొదలైన గుణాలకు నిధివంటివారు, కవులలో తార్కికులలో గొప్పవారైన ఆ దేశికులను నేను సేవిస్తున్నాను.

98 అఞ్జలి వైభవమమవదద్విబుధముదే యో విపశ్చితాం ప్రవరః,
త్రయ్యన్తసూరివర్యస్తస్మై కలయేఽహమఞ్జలిం సతతమ్

విద్వాంసులలో గొప్పవారైన వేదాంత దేశికులు అంజలి వైభవాన్ని తెలిపే అంజలి వైభవం అనే గ్రంథాన్ని పండితుల ఆనందం కోసం రచించారు. వేదాంతాచార్యులు అనే పేరు కలిగిన ఆ దేశికులకు నేను సదా అంజలి చేస్తున్నాను.

99 రమ్యం ప్రధానశతకం నిర్మమవిబుధైర్నిరన్తరం సేవ్యమ్,
యః ప్రాహ వేఙ్కటార్యః తమహం సేవే ప్రధానగురువర్యమ్

పండితులకు సదా సేవించదగినది, అందమైనది అయిన ప్రధాన శతకం అనే గ్రంథాన్ని వేదాంత దేశికులు రచించారు. అటువంటి, పండితులలో గొప్పవారైన ఆ వేదాంత దేశికులను నేను సేవిస్తున్నాను.

100 భయావర్తే భీమే భ్రమముపగతానాం ప్రతిపదం
దనానాం రక్షార్థం జగతి గతిమన్యామవిదుషామ్,

**ప్రకృష్టాం శ్చక్రే పరమపదసోపానపదవీం ప్రపద్యే**
**తం వాదిద్విరదపృతనా సింహమనఘమ్**

భయంకరమైనది, భ్రాంతి ని కలిగించేది అయినాఈ సంసారంలో వేరు గతిని తెలియనివారైన జనుల రక్షణ కోసం వేదాంత దేశికులు పరమపద సోపానం అనే గొప్ప గ్రంథాన్ని రచించారు. ఇటువంటివారు, ప్రతివాదులనే గజాలకు సింహంవంటివారు అయిన దేశికులను నేను శరణు పొందుతున్నాను.

101 **అభయప్రదానసారంవ్యతనుత వేదాన్తదేశికోయస్తమ్,**
**అభయప్రదం నతానామహముపసేవే భయప్రదం కుదృశామ్**

భక్తులకు అభయాన్ని కలిగించే అభయ ప్రదానసారం అనే గ్రంథాన్ని దేశికులు రచించారు. అటువంటివారు, కుదృష్టివాదులకు భయాన్ని కలిగించేవారైన దేశికులను నేను సేవిస్తున్నాను.

102 **ఆరభాయాద్యం శ్రీధరం దేశికానాం**
**చక్రే రమ్యాం సంప్రదాయస్య శుద్ధిమ్,**
**సత్త్వస్థానాం శ్రేయసే దేశికో యః**
**త్రయ్యన్తార్యం సంస్తువే వేఙ్కటేశమ్**

సాత్వికుల క్షేమం కోసం దేశికులు శ్రీధరునినుండి ఆరంభించి స్వాచార్యుల వరకు కొనసాగే సంప్రదాయాన్ని వివరిస్తూ సంప్రదాయ పరిశుద్ధి అనే గ్రంథాన్ని రచించారు. వేదాంతాచార్యులైన ఆ వేంకటనాథులను నేను స్తుతిస్తున్నాను.

103 **ఉపకారపరమ్పరాం హరేర్యః ప్రథయామాస సతాం సమాశ్రితానామ్**
**పకారపారేఽపి సర్వజన్తౌ ఉపకారాన్ కలయన్తమాశ్రయే తమ్**

తమకు అపకారాన్ని తలపెట్టేవారికి కూడా ఉపకారాన్ని చేసే స్వభావం కల వేదాంత దేశికులు భగవానుడు మనకు చేసిన ఉపకార పరంపరను వివరిస్తూ ఉపకార పరంపర అనే గ్రంథాన్ని రచించారు. వారిని నేను శరణు పొందుతున్నాను.

104 **సకలజనరక్షణార్థం సరసం సారసఙ్గ్రహం వితనోత్**
**ప్రవరం చ దేశికానాం కలయే పరవాదిప్పవక్త్రం తమ్**

సకలజనసంరక్షణ కోసం వేదాంత దేశికులు సరసమైన సార సంగ్రహం అనే గ్రంథాన్ని రచించారు. ఆచార్యులలో గొప్పవారు, కవివాదిసింహులైన ఆ దేశికులను

నేను భావిస్తున్నాను.

105 **అభిగమనముఖైర్యః పూజయన్ దేశికేన్ద్రః**
**శ్రితవిశముదారం శ్రీపతిం రఙ్గపుర్యామ్,**
**స్వపదనతజనానాం స్వప్రబన్ధాన్వివృణ్వ**
**న్న్యవసదఖిలవాదిధ్వాన్తభానుం భజే తమ్**

తనను ఆశ్రయించిన వారిపట్ల గొప్ప ప్రీతి కలవాడు, ఉదారుడు అయిన శ్రీరంగనాథుని అభిగమనం మొదలైన ఐదు విధాలైన ప్రకారాలతో ఆరాధిస్తూ, తమ పాదాలను ఆశ్రయించినవారికి తాము రచించిన ప్రబంధాలను వివరిస్తూ వేదాంత దేశికులు శ్రీరంగంలో కొంతకాలం నివసించారు. చీకటివంటివారైన ప్రతివాదులందరిని నిరసించే సూర్యునివంటివారైన ఆ దేశికులను నేను భజిస్తున్నాను.

106 **బ్రహ్మతన్త్ర చతురాయ యోగినేసర్వతన్త్ర చతురో గురూత్తమః,**
**వేదమౌళి యుగళం భ్యుపాదిశద్వాదిసింహమనఘం తమాశ్రయే**

సర్వతంత్ర స్వతంత్రులైన దేశికులు బ్రహ్మతంత్ర స్వతంత్ర పరకాలస్వామికి ఉభయ వేదాంతాలను ఉపదేశించారు. ప్రతివాదులనే గజాలకు సింహం వంటివారైన ఆ వేదాంత దేశికులను నేను ఆశ్రయి స్తున్నాను.

107 **కాఞ్చ్యాం తతః కఞ్చనకోశ మత్తం**
**మతం యతీశస్య చ దూషయన్తవ్,**
**యో బ్రహ్మతన్త్రే చతురోఽజయత్తం**
**తాదృక్షశిష్యం గురుమానతోఽస్మి**

కాంచీపురంలో భగవద్రామానుజులవారి మతాన్ని దూషించే, పాండిత్య మతాన్ని కలిగిన ఒక పండితుని బ్రహ్మతంత్ర స్వతంత్ర పరకాల స్వామి వాదంలో జయించారు. అటువంటి గొప్ప శిష్యులను కలిగిన దేశికులను నేను నమస్కరిస్తున్నాను.

108 **త్రింశద్వారం శ్రావితం యేనభాష్యమ్**
**స్వస్మిన్ సమ్యగ్భక్తభాజాం జనానామ్**
**ప్రజ్ఞాసిన్ధుం పఙ్కజాక్షార్యపౌత్రం తం**
**వేదాన్తాచార్యమీడేసదాఽహమ్**

తమపట్ల మిక్కిలి భక్తిని కలిగిన శిష్యులకు ముప్పై సార్లు శ్రీ భాష్యాన్ని ఉపదేశించిన ప్రజ్ఞా సముద్రులు, పుండరీకాక్షసూరి పౌత్రులు అయిన దేశికులను నేను

సేవిస్తున్నాను.

**109 శిరసా హరిదాసానాం పదరక్షాం యో దధార గురువర్యః,**
**దురితనివర్తనదక్షా తత్పదరక్షా తు మమ శిరోరక్షా**

హరిదాసుల పాదరక్షలను తమ శిరస్సుకు ఆభరణంగా ధరించిన గురువర్యులైన వేదాంత దేశికుల పాదరక్షలే నా శిరస్సుకు రక్ష. అవే నా పాపాలను పోగొట్టగల్గిన శక్తిని కలిగినవి.

**110 యో దేశికః కదాచిత్ స్వప్నే వరదస్య నియమనాత్పుత్రమ్,**
**లేభే రమ్యగుణాఢ్యం సేవేఽనన్తార్యసూరితనయం తమ్**

వేదాంత దేశికులు వరదరాజస్వామి అనుగ్రహం వల్ల గొప్ప గుణాలను నిండుగా కల పుత్రుని పొందారు. అటువంటి, అనంతసూరి పుత్రులైన వేదాంత దేశికులను నేను సేవిస్తున్నాను (దేశికుల పుత్రుల పేరు కుమార వరదాచార్యులవారు).

**111 రోహిణ్యాఖ్యే శ్రావణే మాసి చర్ క్షే జాతశ్చార్యస్తస్య పుత్రస్య రజ్గే,**
**చక్రే సమ్యగ్జాతకర్మాదికం యస్తం సేవేఽహం వేదచూడార్యసూరిమ్**

తమకు పుట్టిన పుత్రునకు వేదాంత దేశికులు శ్రావణ మాసంలో రోహిణి నక్షత్రంలో చక్కగా జాతకర్మ సంస్కారాన్ని శ్రీరంగంలో చేశారు. అటువంటి వేదాంతాచార్యుడైన దేశికులను నేను సేవిస్తున్నాను.

**112 శ్రాద్ధే పితుర్యస్య గురోః కదాచిత్ ప్రీతిప్రకర్షేణ తురజ్గవక్త్రః,**
**అభ్భు శుద్ధాని హవీంషి సాక్షాత్ తమాశ్రయేత్యద్భుతభక్తియుక్తమ్**

ఒక పర్యాయం వేదాంత దేశికులు నిర్వహించిన పితృశ్రాద్ధ కర్మలో హయగ్రీవుడు వారిపట్ల ఉండే ఆదరంవల్ల సాక్షాత్తుగా వచ్చి, వారు సమర్పించిన పవిత్రమైన హవిస్సులను స్వీకరించాడు. అటువంటి అద్భుతమైన హయగ్రీవ భక్తి కలిగిన దేశికులను నేను ఆశ్రయిస్తున్నాను.

**113 యోనోపనీతో గురుణా కుమారో యస్మాదవాపాఖిలవేదజాతమ్,**
**తస్మై నరా యే రచయన్తి భక్తిం తేషాం పదాబ్జే ప్రవణం మనో మే**

కుమార వరదాచార్యులువారు తమ తండ్రి అయిన వేదాంత దేశికులవల్లనే ఉపనయన సంస్కారాన్ని పొందారు. అన్ని వేదాలను వారి వల్లనే నేర్చారు. అటువంటి

వేదాంత దేశికుల పాదపద్మాల పట్ల ఎవరికి భక్తితో ఉన్నారో, వారి పాదపద్మాల విషయంలో నా మనసు భక్తిని కలిగి ఉన్నది.

**114 అవాప్య యస్మాద్వరదార్య నామా**
**సూరిః సమస్తాన్యపి శాసనాని,**
**యతీన్ద్రసిద్ధాన్తజయ ధ్వజోఽభూత్**
**తం వేఙ్కటార్యం ససుతం భజేఽహమ్**

వేదాంత దేశికులు సన్నిధిలోనే కుమార వరదాచార్యులవారు అన్ని శాస్త్రాలను, శ్రీ రామానుజ సిద్ధాంత తత్వాలను నేర్చారు. ఆ సిద్ధాంతానికి విజయధ్వజంగా అయ్యారు. ఆ విధంగా తమ పుత్రుని వేదాంత దేశికులు చక్కగా తీర్చిదిద్దారు. ఆ వేదాంత దేశికులను, వారి కుమారులైన నయనవరదులను నేను సేవిస్తున్నాను. కుమార వరదాచార్యులవారు వేదాంత దేశికుల పలు గ్రంథాలను వ్యాఖ్యానించారు.

**115 కాఞ్చీప్రదేశాదుపజగ్మివాంసం వివిత్సయావీక్ష్య వటుం కృపాతః,**
**విత్తం రమోపాస్తివరోపలబ్ధిం తస్మై దదౌ యస్తమహం ప్రపద్యే**

ఒకానొక సమయంలో ఒక బ్రహ్మచారి తాను గృహస్థాశ్రమం స్వీకరించడానికి కావలసిన ధనం లభించలేదని వారి వద్దకు వచ్చి విన్నవించగా, అప్పుడు దేశికులు లక్ష్మీ దేవిని ప్రార్థిస్తూ శ్రీ స్తుతిని అనుగ్రహించారు. దానిని విని లక్ష్మీదేవి ఆనందించి బంగారు నాణాలను వర్షించింది. వానిని దేశికులు ఉదారంగా ఆ బ్రహ్మచారికి ఇచ్చి, అతడు గృహస్థాశ్రమం స్వీకరించడానికి తగిన ధనాన్ని సంపాదించి ఇచ్చారు. అటువంటి దేశికులను నేను సేవిస్తున్నాను.

**116 ధనాని శిష్యైస్సహతణ్డులేన దత్తానిదేవ్యా సహ దేశికేన్ద్రః,**
**దృష్ట్వా స్వ గేహాద్బహిరక్షిపద్యః సమాశ్రయే తం సమలోష్టరుక్మమ్**

ఒక పర్యాయం ఉంఛవృత్తికై వెళ్ళిన వేదాంత దేశికులకు వారి శిష్యులు పాత్రలో బియ్యంతో పాటు ధనాన్ని కూడా కలిపి సమర్పించారు. దేశికులు దానిని గమనించలేదు. వారు ఇంటికి వచ్చిన తరువాత పాత్రను చూడగా అందులో బియ్యంతో పాటు కొంత ధనం కూడా కనిపించింది. అప్పుడు దేశికులు, వారి ధర్మపత్ని గమనించి చూసి, ఆ పాత్రలో ఉండే ధనాన్ని తీసి తమ ఇంటి బయట పారవేశారు. అటువంటి బంగారాన్ని,ధనాన్ని మట్టిముద్దలతో సమానంగా చూడగలిగిన గొప్ప వైరాగ్యాన్ని కలిగిన

దేశికులను ఆశ్రయిస్తున్నాను.

**117 సంప్రార్థితః సంసది సూరివర్యైః పాదావనిం రఙ్గపతేర్నిశాయామ్,**
**పద్యైస్సహస్రైర్గురురస్తువద్యః తం భావయేఽహం కవిసార్వభౌమమ్**

పండిత సభలో విద్వాంసులు ప్రార్థించగా వేదాంత దేశికులు శ్రీరంగనాథుని పాదుకలను ఉద్దేశించి పాదుకా సహస్రం అనే అపూర్వమైన కావ్యాన్ని రచించారు. అటువంటి కవిసార్వభౌములైన దేశికులను నేను భావిస్తున్నాను.

**118 రఙ్గాధిపేన సమ్యక్ శ్రుత్వా పాదావనిస్తుతిం ప్రీత్యా,**
**కవితార్కికసింహత్వం దత్తం గురూత్తమం సేవే**

ఒకానొక సందర్భంలో శ్రీరంగనాథుడు పాదుకా సహస్ర కావ్యాన్ని సభలో ఆలకించి దేశికులకు "కవి తార్కిక సింహలు" అనే బిరుదాన్ని అనుగ్రహించాడు. అటువంటి గురూత్తములైన దేశికులను సేవిస్తున్నాను.

**119 గ్రన్థైశ్చతుస్సప్తతిభిస్సహస్రైః చతుస్సహస్రార్థవిశేషయుక్తైః,**
**షట్సహస్రస్య చకారవృత్తిం తం దేశికం నౌమి తంసహస్రమ్**

తిరుక్కురుకై ప్పిరాన్ పిళ్ళాన్ అనుగ్రహించిన ఆరాయిరప్పడి అనే తిరువాయ్ మొழி వ్యాఖ్యానానికి వివరణను 74 వేల గ్రంథాల పరిమితిలో నాలుగువేల అర్థ విశేషాలతో కూడినదిగా దేశికులు రచించారు. అటువంటి వేదాంత దేశికులను నేను వందల మార్లు, వేల మార్లు నమస్కరిస్తున్నాను.

**120 మునివాహనస్య సుకవేః సూక్తేర్వ్యాఖ్యాం సుధామయీం సుభగామ్,**
**యో దేశికో వితేనే యోగవిదం తం విభావయే హృదయే**

గొప్ప కవి అయిన మునివాహన సూరి అనుగ్రహించిన అమలనాదిపిరాన్ అనే ప్రబంధానికి దేశికులు అందమైన, అమృతమయమైన వ్యాఖ్యానాన్ని రచించారు. యోగవిదులలో గొప్పవారైన ఆ దేశికులను నేను నా మనసులో భావిస్తున్నాను.

**121 మధురకవిదివ్యసూక్తేర్వ్యాఖ్యారూపం య ఏష గురువర్యః**
**మధురకవిహృదయమూచే తమహం వన్దేయ మధురక్విర్యమ్**

మధుర కవులు రచించిన కణ్ణినుణ్ శిఱుత్తాంబు ప్రబంధానికి వేదాంత దేశికులు ఆ మధుర కవుల హృదయాన్ని ఆవిష్కరిస్తూ అందమైన వ్యాఖ్యానాన్ని

మధురకవి హృదయం అనే పేరుతో రచించారు. మధుర కవులైన ఆ దేశికులకు నేను నమస్కరిస్తున్నాను.

**122 సారం గురుర్యశ్శఠకోపసూక్తేస్తాత్పర్యరత్నావళిమద్భుతార్థమ్,**
**వినిర్మమే నిర్మమనిత్యధార్యం విభావయే తంహృది వేఙ్కటేశమ్**

నమ్మాళ్వార్లు అనుగ్రహించిన తిరువాయ్ మొళి ప్రబంధంలోని సారాన్ని తెలుపుతూ దేశికులు సంస్కృత భాషలో ద్రవిడోపనిషత్ తాత్పర్య రత్నావళి అనే అద్భుతమైన, శ్లోక రూపంలోని, వైరాగ్యాన్ని కలవారు నిత్యం తమ మనసులో భావించ దగిన గ్రంథాన్ని రచించారు. అటువంటి దేశికులను నా హృదయంలో భావిస్తున్నాను.

**123 సంగృహ్య దేశికేన్ద్రో హరిపదపూజాక్రమం వితేనే యః**
**తత్పదపద్మముపాసే విబుధజనానాం శుబం శింః కుసుమమ్**

భగవానుని ఆరాధించే క్రమాన్ని సంగ్రహంగా తెలుపుతూ దేశికులు భగవదారాధన విధిః-అనే గ్రంథాన్ని రచించారు. పండిత జనుల శిరస్సులను అలంకరించే,మంగళకరమైన, పుష్పంవంటి వారి పాదాలను నేను ఉపాసిస్తున్నాను.

**124 చక్రే ప్రబన్ధసారం ద్రామిడనిగమాన్తతత్త్వదర్శియః,**
**ఆహారనియతిగాథం ఆగమచూడార్యమాశ్రయే సతతమ్**

ద్రావిడ వేదాంతంలోని తత్త్వాలను చక్కగా దర్శించిన దేశికులు తమిళంలో ప్రబంధ సారం అనే గ్రంధాన్ని రచించారు. ఆ విధంగానే, ఆహారనియమాలను తెలిపే ఆహార నియమం అనే ప్రబంధాన్ని కూడా రచించారు. అటువంటి, వేదాంతాచార్యులైన దేశికులను నిత్యం సేవిస్తున్నాను.

**125 మూలమనుసఙ్గ్రహం యఙ్గ్రహం యఙ్గ్రహం**
**యః చరమశ్లోకార్థసఙ్గ్రహం సూరిః,**
**ద్వయసఙ్గ్రహం చ రమ్యం**
**గాథారూపం చకార తం సేవే**

తిరుమంత్రం, ద్వయం, చరమ శ్లోకం అనే మూడు రహస్యాలులోని అర్థాలను సంగ్రహిస్తూ దేశికులు తిరుమల మందిర చ్చురుక్కు, ద్వయ చ్చురుక్కు, చరమ శ్లోకచ్చురుక్కు అనే ద్రావిడ ప్రబంధాలను గాథల రూపంలో అందంగా రచించారు. అటువంటి దేశికులను సేవిస్తున్నాను.

126 గీతార్థసఙ్గ్రహగాథా గీతా విదుషాం రసావహాయేన
రమ్యా ప్రపత్తిగాథా రమణీయగుణం తమాశ్రయే నిత్యమ్,

127 దశరథనృపసూనోర్హృదయమత్యద్భుతం యః
కవికథకమృగేన్ద్రః సర్వతన్త్రస్వతన్త్రః
అతనుత రమణీయం హంససన్దేశరత్నం
శరణమిహ భజే తం శాన్తివాత్సల్యసిన్ధుమ్

కవి కథక కేసరి, సర్వతంత్ర స్వతంత్రులు అయిన వేదాంత దేశికులు దశరథ సుతుడైన శ్రీరామచంద్రుని హృదయాన్ని అద్భుతంగా అందమైన హంస సందేశమనే కావ్యం ద్వారా ఆవిష్కరించినవారు , శాంతి వాత్సల్యం మొదలైన గుణాలకు సముద్రం వంటివారైన దేశికులను నేను శరణు పొందుతున్నాను.

128 సుగుణా సుభాషితానాం మాలా రచితా మహాత్మనాం ప్రీత్యై,
నిర్మమసుహృదవిదుషాం నిగమాన్తగురుం భజామి తం నిత్యమ్

సర్వజ్ఞసింగ నాయకుడు అనే ప్రభువు ప్రీతికోసం అతనిచే పంపబడిన, అహంకారమమకారాలు లేని ఇద్దరు బ్రాహ్మణోత్తముల ప్రీతికోసం దేశికులు సుభాషితనీవి అనే గొప్ప నీతిగ్రంథాన్ని రచించారు. ఇది నీతి శాస్త్రసారరూపమైనది. గొప్ప గుణాలను కలిగినది. అటువంటి దేశికులను నేను నిత్యం భజిస్తున్నాను.

129 తత్త్వార్థసనదేశయుతం వితేనే రహస్యసన్దేశమతీవరమ్యమ్,
వ్యాఖ్యాయో మాధవసూనురక్షాహేతోస్తమార్యం శరణం జజేఽహమ్

రాజమహేంద్ర పట్టణప్రభువైన మాధవ నాయకుని పుత్రుడు సర్వజ్ఞ సింగ నాయకుడు. అతనిని వేదాంత శాస్త్రంలో అనుగ్రహించడం కోసం శ్రీభాష్యకారుల సిద్ధాంతాలను వివరించే తత్త్వార్థ సందేశం, రహస్య సందేశం అనే రెండు గ్రంథాలను వేదాంత దేశికులు రచించారు. ఆ ఆచార్యులను నేను శరణు పొంది కీర్తిస్తున్నాను.

130 కృత్వాపరాధం కృతినేఽపి యస్మై
దుర్వర్ణతాం ప్రాప స లక్ష్మణార్యః,
పీత్వా శుభం యస్యపదామ్బుపశ్చాత్
సువర్ణతాం ప్రాప తమాశ్రయేఽహమ్

ఒకసారి లక్ష్మణాచార్యులు అనే వ్యక్తి దేశికుల విషయంలో అపచారం చేసి తన అందాన్ని పోగొట్టుకొని, వికారమైన రూపాన్ని పొందాడు. తరువాత తన తప్పును

గుర్తించి, దేశికుల సన్నిధిలో అపరాధ క్షమాపణ ప్రార్థించి, వారి వద్ద వేదాంత గ్రంథ కాలక్షేపాన్ని చేశాడు. దేశికులు అతనికి తమ శ్రీపాద తీర్థాన్ని అనుగ్రహించారు. ఆ తీర్థాన్ని స్వీకరించిన కారణంగా లక్ష్మణాచార్యులు బంగారు రంగు కలిగిన అందమైన రూపాన్ని పొందాడు. ఇటువంటి గొప్ప మహిమ కలిగిన దేశికులను నేను శరణు పొందుతున్నాను.

**131 భాష్యప్రకాశికాం తాం సఙ్కటకాలే సుదర్శనసూరిః,**
**ప్రాదాద్యస్మై కృతినే సేవే తం వేదచూడికాసూరిమ్**

యవనులవల్ల ఉపద్రవం ఏర్పడినపుడు శ్రీ సుదర్శన సూరి శ్రీభాష్యానికి తాము అనుగ్రహించిన శ్రుత ప్రకాశిక అనే వివరణాన్ని దేశికులకు ఇచ్చి, దానిని రక్షించమని కోరారు. ఆ విధంగా ఆచార్య కైంకర్యం చేసుకోగలిగిన అదృష్టవంతులైన దేశికులను నేను సేవిస్తున్నాను.

**132 తాం తు గృహీత్వా రాత్ర్యాం తత్తనయాభ్యాం సమం కథఞ్చిద్యః,**
**తస్మాద్గురుః ప్రతస్థే తమహం సేవే సమస్తజనమిత్రమ్**

దేశికులు రాత్రిసమయంలో శ్రుత ప్రకాశికగ్రంథాన్ని, సుదర్శన సూరి పుత్రులైన వేదవ్యాస భట్టర్, పరాంకుశ భట్టర్ అనే ఇద్దరు కుమారులను వెంటబెట్టుకుని శ్రీరంగంనుండి ఏదో ఒక విధంగా బయటకు వెళ్లిపోయి ఆ గ్రంథాన్ని, సుదర్శనసూరి పుత్రులను రక్షించారు. అటువంటి, సర్వజన మిత్రులైన దేశికులను శరణు పొందుతున్నాను.

**133 సత్యమఙ్గలమవాప్య దేశికో దేవరాజపదసన్నిధౌ నతః**
**యోఽవసద్బుధజనాధిపః సుతైః తం భజే కవిమృగేన్ద్రమన్వహమ్**

ఆ విధంగా శ్రీ భాష్య వివరణాన్ని రక్షించే ప్రయత్నంలో దేశికులు కర్ణాటక దేశంలోని సత్యమంగళం ప్రాంతానికి చేరి, అక్కడ వేంచేసి ఉండే వరదరాజ స్వామిని సేవించి, అక్కడ కొంత కాలం సుదర్శనసూరి పుత్రులతో నివసించారు. అక్కడ ఉండే విద్వాంసులకు గొప్పవారైన కవితార్కికసింహులు వేదాంత దేశికులను నేను ప్రతి దినం సేవిస్తున్నాను.

**134 కృత్వోపనీతౌ విధివత్కుమారౌ సర్వాణి శాస్త్రాణ్యపి దేశికేన్ద్రః,**
**ఉపాదిశద్యః కృపయా తయోస్తం విభావయే వేఙ్కటదేశికేన్ద్రమ్**

సుదర్శన సూరి పుత్రులకు ఇద్దరికి దేశికులు ఉపనయనసంస్కారాన్ని శాస్త్ర ప్రకారం చేసి, వారికి దయతో అన్ని శాస్త్రాలను నేర్పారు. అటువంటి వేంకటేశులనే పేరును కల దేశికేంద్రులను నేను మనసులో భావిస్తాను.

**135 శ్రీభాష్యటీకా సుభగా తదానీం సంరక్షితా యోన గురూత్తమేన,**
**ప్రవర్తితాం సన్తశిష్యవర్గే పదామ్బుజం తస్య శుభం ప్రపద్యే**

అందమైన శ్రీభాష్యటీక శ్రుత ప్రకాశికను చక్కగా రక్షించి, దానిని తమకు విధేయులైన శిష్యులకు ఉపదేశించిన గొప్ప ఆచార్యులైన దేశికుల మంగళాన్ని కలిగించే పాద పద్మాలను నేను శరణు పొందుతున్నాను.

**136 సుభగా గత్వా తతో యాదవభూధరేన్ద్రం**
**స్నాత్వా చ కల్యాణసరోవరే యః,**
**దధార రమ్యాన్గురురూర్ధ్వపుణ్డ్రాన్**
**దయానిధిం తం శరణం భజేஉహమ్**

తరువాత అక్కడ నుండి యాదవాద్రి అనే పేరుతో ప్రసిద్ధి చెందిన తిరునారాయణ పురానికి చేరి, అక్కడ కళ్యాణ పుష్కరిణిలో స్నానమాడి, అందంగా ఊర్ధ్వ పుండ్రాలును ధరించిన దయానిధి అయిన వేదాంత దేశికులను నేను నేను శరణు వేడుతున్నాను.

**137 పూర్వం యతీన్ద్రం ప్రణిపత్య**
**పశ్చాన్నారాయణం చాపి రమాసమేతమ్,**
**తత్సేవయా హృష్టమనాగురుర్యః**
**తత్పాదపద్మం ప్రణతోஉస్మి నిత్యమ్**

ముందుగా, అక్కడ వేంచేసి ఉండే శ్రీరామానుజులను సేవించి, తర్వాత లక్ష్మీసహితుడైన తిరు నారాయణ స్వామిని సేవించి, వారి సేవల వల్ల ఆనందాన్ని పొందిన మనస్సు కలిగినవారైన గురువర్యులు వేదాంత దేశికులను నేను నిత్యం శరణు పొందుతున్నాను.

**138 తత్రైవ తస్మై యతిరాజవీక్షాపాత్రాయ పుత్రాయ చ హర్షయుక్తః**
**దివ్యప్రబన్ధార్థముపాదిశద్యః తం వేదచూడాగురువర్యమీడే**

శ్రీ రామానుజుల దివ్యమైన అనుగ్రహానికి పాత్రమైన తమ కుమారులు నయన వరదఆచార్యులవారికి అక్కడే దివ్య ప్రబంధాలలోని దివ్యార్ధాలను

ఆరాయిరప్పడి వ్యాఖ్యానాన్ని వివరించడంద్వారా అనుగ్రహించిన గురువర్యులు అయిన వేదాంత దేశికులను నేను శరణు పొందుతున్నాను.

**139 ఆశాస్య దేశస్య తదా సమృద్ధిమామ్నాయచూడాగురుసార్వభౌమః, పూర్వోషితం స్థానమవాప యస్తం పూతం బుధానాం ప్రవరం భజేఽహమ్**

తాము నివసించిన తిరునారాయణ పురప్రాంతానికి అభివృద్ధి కలగాలని మంగళాశాసనం చేసిన తర్వాత తాము ముందు నివసించిన శ్రీరంగ క్షేత్రానికి తిరిగివచ్చిన, పండితులలో గొప్పవారైన వేదాంత దేశికులను నేను భజిస్తున్నాను.

**140 అభీతిహేతోః స్తుతిమద్భుతార్థాం రమ్యాం గభీరామతనోద్గురుర్యః తద్భక్తిపూతా మనుజాః పృథివ్యాం మహానుభావా మమ వంశనాథః**

శ్రీరంగం మొదలైన దివ్య దేశాలకు యవనులు మొదలైనవారి వల్ల కలిగిన భయం తీరడం కోసం అందమైనది, అద్భుతమైన అర్థాలను కలిగినది, గంభీరమైనది అయిన అభీతి స్తవం అనే గ్రంథాన్ని వేదాంత దేశికులు అనుగ్రహించారు. అటువంటి దేశికుల పట్ల కలిగిన భక్తి కలిగిన మహానుభావులే నా వంశానికి నాథులు.

**141 జిత్వా తురుష్కాన్భువి గోప్పణేన్ద్రో రఙ్గాధిపం స్థాపితవాన్ స్వదేశే, ఇత్యేవమాకర్ణ్య గురుః కవీన్ద్రో హృష్టోఽభవద్యస్తమహం ప్రపద్యే**

గొప్ప భగవద్భక్తి కలవాడైన విజయనగర ప్రభువు గోపనార్యుడు శ్రీరంగనాథుని ఉత్సవ మూర్తిని మళ్ళీ శ్రీరంగ క్షేత్రంలో స్థాపించాడని విని చాలా ఆనందించి మళ్ళీ శ్రీరంగానికి బయలుదేరిన కవీంద్రులు వేదాంత దేశికులను నేను శరణు పొందుతున్నాను.

**142 తతః స్వదేవ్యా తనయేన సాకం శిష్యైరనేకైః సహ దేశికో యః ఉపాగమద్రఙ్గపురీముదారాం తం వాదిసింహం ప్రణమామినిత్యమ్**

ఆ తరువాత తన ధర్మపత్నితో, పుత్రునితో, అనేకమంది శిష్యులతో పాటు దేశికులు శ్రీరంగ నగరాన్ని చేరారు. అటువంటి ప్రతివాదిసింహులైన దేశికులను నేను సదా నమస్కరిస్తున్నాను.

**143 ప్రణమ్యరఙ్గాధిపమాత్మగేహం సంప్రాప్య వేదాన్తయుగం సమగ్రమ్, ప్రవర్తయన్భక్తిమతాం బుధానాం ప్రీతో బభౌ యస్తమహం భజామి**

శ్రీరంగనాథుని నమస్కరించి, తరువాత తమ నివాసానికి చేరిన వేదాంత దేశికులు ఉభయ వేదాంతాలను పూర్తిగా బుద్ధిమంతులైన, తమ పట్ల భక్తిని కలిగిన శిష్యులకు అనుగ్రహించి, శ్రీ రామానుజ సిద్ధాంతాన్ని ప్రచారం చేసి ఆనందించారు. అటువంటి వేదాంత దేశికులను నేను భజిస్తున్నాను.

**144 కీలకాబ్దే ధనుర్మాసే పఞ్చమ్యాం శుక్లపక్షకే,**
**తత్తారే శిల్పిరాజం తమజయద్దేశికోత్తమః**

కీలక నామ సంవత్సరం ధనుర్మాసంలో శుక్ల పక్ష పంచమి తిలో శిల్ప శాస్త్రంలో గొప్పవాడైన ఒక కళాకారుని వేదాంత దేశికులు జయించారు. తమ విగ్రహాన్నితామే అందంగా చెక్కడం ద్వారా అతని గర్వాన్ని అణచారు. అటువంటి గొప్ప ఆచార్యులను నేను సేవిస్తున్నాను.

(వేదాంత దేశికులకు కల సర్వ తంత్ర స్వతంత్రులు అనే బిరుదును విని ఒక శిల్పి వారి కీర్తిని సహించలేనివాడై, వారి వద్దకు వచ్చి, నాతో పోటీ పడండి - అని అన్నాడు. అతని సవాలును దేశికులు స్వీకరించారు. ఆనాటి రాత్రి శ్రీరంగనాథుడు దేశికులకు కలలో సాక్షాత్కరించి, కుడిచేతిలో జ్ఞాన ముద్రను, ఎడమచేతిలో పుస్తకాన్ని కలిగిన విగ్రహాన్ని నిర్మించమని ఆజ్ఞాపించారు. శ్రీరంగనాథుని అజ్ఞానుసారంగా దేశికులు విగ్రహాన్ని నిర్మించారు. శిల్పి దేశికులు చెక్కిన అందమైన ఆ విగ్రహాన్ని చూచి వారి శిల్ప కళా నైపుణ్యానికి ఆశ్చర్యపడ్డాడు. వారి పాదాలలోపడి క్షమాపణ వేడుకున్నాడు.

**145 పీఠే స్వకృతకే శ్లిష్టం విగ్రహం తం తితక్షతి,**
**శిల్పిరాజే సమభవత్కపోలే రుధిరం గురోః**

అప్పుడు దేశికులు అతనిని ఆ విగ్రహానికి తగినట్లుగా పాదపీఠాన్ని నిర్మించమని కోరారు. ఆ శిల్పి కూడా ఆ విధంగా నిర్మించడానికి ప్రయత్నం చేసేటప్పుడు అతని చేతిలోని శిల్ప సాధనం ఆ విగ్రహం కపోల ప్రాంతంలో తాకింది. వెంటనే ఆ విగ్రహం నుండి రక్తం వెల్లువై స్రవించింది. శిల్పి ఆశ్చర్యపడి ఆ విగ్రహంలో దేశికులు తమ సాన్నిధ్యాన్ని ఉంచారు-అని తెలుసుకున్నాడు. అప్పుడు శిల్పి దేశికులను క్షమాపణ వేడాడు. దేశికులు అతనిని క్షమించారు.

**146 తం శిల్పిరాజం కవిసార్వభౌమో జిత్వాతదా విగ్రహఆవిరాసీత్,**
**శిల్పార్థసారాఖ్యమపూర్వశాస్త్రం చక్రే గురుర్యస్తమహం ప్రపద్యే**

ఆ తరువాత దేశికులు ఆ విగ్రహాన్ని పాదపీఠంలో స్థాపించారు. తరువాత శిల్పశాస్త్రంలోని రహస్యాలను వివరిస్తూ శిల్పార్థసారం అనే ఒక గొప్ప గ్రంథాన్ని రచించి అతనికి ఇచ్చారు. అటువంటి గొప్ప ఆచార్యులను నేను శరణు పొందుతున్నాను. ఆనాడు చెక్కిన విగ్రహాన్ని నయనవరదా చార్యులవారు తమ ఆరాధనలో ఉంచుకొని ఆరాధించారు. ఈనాటికీ ఈవిగ్రహం తిరువహీంద్రపురంలో దేవనాయకస్వామి సన్నిధిలో వేంచేసి ఉండడాన్ని గమనించవచ్చు.

147 యః ప్రీత్యా రఙ్గనాథస్య జ్ఞానముద్రాం చ పుస్తకమ్,
అవాప చిహ్నభూతం తం వన్దే వేదాన్తదేశికమ్

ఈ విధంగా దేశికులు తాముచెక్కిన తమ విగ్రహంలో కుడిచేతిలో శ్రీరంగనాథుని జ్ఞానముద్రను, ఇంకొక చేతిలో భగవద్రామానుజుల శ్రీ భాష్యం గ్రంథాన్ని కలిగిన దేశికులను నమస్కరిస్తున్నాను.

148 శుద్ధం గభీరాం సుమనోనిషేవ్యాం
రమ్యాం రహస్యత్రయసారగఙ్గామ్,
ఉత్పాదయామాసకృపానిధిర్యః
తంవేఙ్కటేశం సతతం భజేఽహమ్

దయానిధి అయినా వేదాంత దేశికులు శుద్ధ మైనది, గంభీరమైనది, పండితులకు సేవించ దగినది, అందమైనది గంగ వంటిది అయిన రహస్య త్రయసారమనే గ్రంథాన్ని అనుగ్రహించారు. ఆ వేదాంత దేశికులను నేను నిత్యం భజిస్తున్నాను.

149 సంప్రీణనార్థం శరణాగతానాం వినిర్మితం వేఙ్కటదేశికేన,
భవాన్ధకారక్షపణ ప్రవీణంసేవేరహస్యత్రయ సారదీపమ్

శరణాగతులను ఆనందింపజేయడం కోసం సంసారమనే చీకటిని తొలగించడంలో సమర్థమైన రహస్య త్రయసారం అనే దీపాన్ని వేదాంత దేశికులు వెలిగించారు. వారిని నేను సేవిస్తున్నాను.

150 తద్విషయే జాతానాం కవికారిసింహాఃసమస్తశఙ్కానామ్,
వ్యతనుతయః పరిహారం వేదాన్తార్యం భజామి తం నిత్యమ్

రహస్య త్రయంలోని అర్థాలలో ఏర్పడి అన్ని సందేహాలను తీర్చడం కోసం

దేశికులు విరోధ పరిహారం అనే గొప్ప గ్రంథాన్ని రచించారు. కవి వాది కేసరి అయిన ఆ వేదాంతాచార్యులను నేను ప్రతి దినం సేవిస్తున్నాను.

**151 యః సారభూతవేదీ సారజ్ఞానాం ముదే గురుప్రవరః,**
**సమనుతసారసారం సారజ్ఞనిధిం తమాశ్రయే సతతమ్**

సారమైన అర్థాలను అన్నిటిని తెలిసినవారు, ఆచార్యులలో గొప్పవారు అయిన దేశికులు సారజ్ఞుల ఆనందం కోసం సార సారం అనే గొప్ప గ్రంథాన్ని రచించారు. సారజ్ఞనిధి అయిన ఆ దేశికులను నేను నేను నిత్యం ఆశ్రయిస్తున్నాను.

**152 శ్రీవేఙ్కటార్యేణ కృతాః ప్రబన్ధాఃసంఖ్యాతుముర్వ్యాం విబుధైర్నశక్యాః,**
**తత్రైకమేకం పరిశీలయన్తో ధన్యా నరాస్తే ధరణీం పునన్తి**

వేదాంత దేశికులు రచించిన ప్రబంధాల సంఖ్యను లెక్కించడానికి పండితులకు కూడా సాధ్యం కాదు. వాటిలో ఒక్క గ్రంథాన్ని పరిశీలించినవారైనా వారు ధన్యులు. వారు భూమిని పవిత్రం చేయగలరు.

**153 శ్రీర్గ శరదః శతం ప్రణిపతం రఙ్గేశపాదామ్బుజం**
**స్వస్మిన్భక్తిమతాం సతాం ప్రకటయన్ స్వోక్తీస్సుధాస్యన్దినీః,**
**గర్వఞ్చ క్షపయన్ ముహుః కవిగటాకణ్ఠీరవో వాదినాం**
**శ్రీమాన్ యస్తనయేన సాకమవసత్తం వేఙ్కటేశం భజే**

వేదాంత దేశికులు శ్రీరంగ క్షేత్రంలోనూరు సంవత్సరాల కాలం శ్రీరంగనాథుని పాదారవిందాలను సేవిస్తూ, తమ పట్ల భక్తి కలిగిన మహాత్ములకు అమృత ప్రవాహాలవంటి తమ సూక్తులను అనుగ్రహిస్తూ, ఇతర మతాల వారి గర్వాన్ని పోగొడుతూ కవివాది కేసరులై తమ కుమారునితో పాటు వేంచేసి ఉన్నారు. ఆ వేదాంత దేశికులను నేను భజిస్తున్నాను.

**154 శుభనయనకపోలం శుభ్రయజ్ఞోపవీతం**
**కమలసదృశపాణింకాన్తబాహాన్తరాళమ్,**
**ఉచితపదనివిష్టానూర్ధ్వపుణ్డ్రాన్ దధాన**
**శ్రుతిశిఖరగురుం తం సూరివన్ద్యం భజేஉహమ్**

అందమైన నేత్రాలను, కపోలాలను, తెల్లని యజ్ఞోపవీతాన్ని, తామర పూవువంటి చేతులను, ఆకర్షణీయమైన వక్షస్థలాన్ని, తగిన స్థానాలలో అలంకరించుకున్న ఊర్ధ్వపుండ్రాలను కలిగినవారైన, పండితులకు

నమస్కరించదగినవారైన దేశికులను నేను భజిస్తున్నాను.

**155 వేదాన్తదేశికవిభో వినయోపపన్న**
**ఘణ్టావతార కరుణాకరశాన్తిసిన్ధో,**
**శ్రీవేఙ్కటేశ గురువర్యకవీశ సింహేత్యేవం**
**పఠంస్తరతిసంసృతివారిరాశిమ్**

వేదాంతదేశికా! ప్రభూ! వినయాన్ని కల వేంకటేశా! ఘంటా అవతార రూపా! కరుణాకరా! శాంతి సింధూ! గురువర్యా! కవివాది కేసరీ! - అని ఈ విధంగా దేశికుల నామాలను అను సంధించేవారు ఈ సంసార సాగరాన్ని దాటుతున్నారు.

**156 దేశికోనిగమాన్తార్యాత్ తద్భక్తాత్సాత్త్వికో జనః,**
**తత్సూక్తేశ్చ ప్రబన్ధోఽన్యో నాస్తి నాస్తి మహీతలే**

వేదాంత దేశికుల కంటే వేరొక గొప్ప గురువు, వారి శిష్యుని కంటే ఇంకొక గొప్ప సాత్వికుడు, వారి సూక్తుల కంటే మరి ఒక గొప్ప ప్రబంధం ఈ లోకంలో లేదు లేదు లేదు.

**157 అపరిచిత సమ్ప్రదాయైరవిదితయతిరాజసూక్తితత్త్వార్థైః,**
**అక్షమితకుదృష్టగర్వైః అలమలమన్యైరనాగమాన్తరైః**

శ్రీ వైష్ణవ సంప్రదాయంలో పరిచయం లేని, శ్రీరామానుజ సూక్తులలోని తత్వార్థాలను తెలియని, తగని కుదృష్టి వాదులను నిరసించని అన్యుల వల్ల ఏ ఉపయోగం లేదు.

**158 స్మరతి నిగమచూడదేశికేన్ద్రం మనో మే**
**వదతిమమనికామం తస్యనామానిజిహ్వా,**
**నమతి మమ శరీరం తత్పదాబ్జే మనోజ్ఞే**
**తదిహ పరిమతం మే తాదృశం భాగధేయమ్**

నా మనసు నిగమాంత దేశికులను స్మరిస్తూ ఉన్నది. నా నాలుక వారి నామాలను ఆదరంగా పలుకుతున్నది. నా శరీరం అందమైన వారి పాదాంబుజాలలో నమస్కరిస్తున్నది. నా అదృష్టం ఈ విధంగా చక్కగా పరిణమించి ఫలించింది.

**159 జయతి నిగమచూడాదేశికేన్ద్రో దయాళుః**
**జయతి సుమతి సేవ్యా శోభనా తస్య సూక్తిః,**
**జయతి శుభగుణం తం శీలయన్ సూరిసఙ్ఘః**
**జయతి వసుమతీ సా తస్య సఞ్చారధన్యా**

దయా స్వభావులైన నిగమాంత దేశికులు వర్ధిల్లుతున్నారు. పండితులకు మంగళకరమైన వారి సూక్తి వర్ధిల్లుతున్నది. గొప్ప మంచి గుణాలు కలిగిన ఆ దేశికుల సూక్తులను అనుసంధించే పండితుల సంఘం వర్ధిల్లుతున్నది. దేశికుల పాదసంచారంతో ధన్యమైన ఈ భూమి వర్ధిల్లుతున్నది.

**160 విశ్వాతిశాయనే విశ్వామిత్రగోత్రాంబుధీన్దవే,**
**విష్ణుఘణ్టావతారాయ వేఙ్కటేశాయ మఙ్గళమ్**

అన్ని గొప్పతనాలను కలిగినవారు, విశ్వామిత్ర గోత్రంలో పుట్టిన చంద్రునివంటివారు శ్రీ వేంకటేశ్వరుని గంటయొక్క అవతారూపులు అయిన వేదాందేశికులకు మంగళం.

**161 కల్యాణగుణభూషాయ కామితార్థ ప్రదాయినే,**
**కమనీయ శరీరాయ కవిసింహాయ మఙ్గళమ్**

శుభగుణాలను ఆభరణంగా కలవారు, కోరిన కోరికలను అన్నిటిని అనుగ్రహించేవారు, అందమైన రూపాన్ని కలవారు అయిన వేదాంతదేశికులకు మంగళం.

**162 వేదచూడా పరిష్కార సూక్తిమాలాం వితన్వతే,**
**వేదచూడార్యవర్యాయ విబుధేన్ద్రాయ మఙ్గళమ్**

వేదాంతాలకు ఆభరణాలవంటి సూక్తిమాలికలను అనుగ్రహించేవారు, వేదాంతచార్యులు, గొప్ప పండితులైన దేశికులకు మంగళం.

**163 స్వజిహ్వాగ్రసమాసీన తురఙ్గాననహేషితైః,**
**సువిరస్తవిపక్షాయ శ్రుత్యన్తార్యాయమఙ్గళమ్**

తమ నాలుక చివర వేంచేసి ఉండే, సర్వశాస్త్రార్థరూపాలైన హయగ్రీవ హేషాధ్వనులతో విపక్షాలను అన్నిటినీ నిరసించిన వేదాంతాచార్యులకు మంగళం.

**164 మఙ్గళాకృతయే విశ్వమాన్యాయ నిధయే సతామ్,**
**మత్స్వామినే త్రయీమౌళి దేశికాయాస్తు మఙ్గళమ్**

మంగళకరమైన ఆకారాన్ని కలవారు, అందరికీ మాన్యులు, మహనీయులకు నిధి, నాకు స్వామి అయిన వేదాంతాచార్యులకు మంగళం కలగాలి.

165 **ఇతీరితాం రసవహాం విశుద్ధచేతసాం సతామ్,**
**త్రయీకిరీటదేశికేన్ద్రవైభవప్రకాశికామ్**

166 **సమస్త కల్మషాపహాంసకృత్పఠన్తి యే నరాః,**
**తరన్తి తే భవామ్బుధిం క్షమాదయా శమాన్వితాః**

ఈ విధంగా వేదాంతాచార్యులనే దేశికుల వైభవాన్ని తెలియజేసేది, మంచి మనసు కలిగిన మహనీయులకు ఆనందాన్ని కలిగించేది అయిన వేదాంత దేశిక వైభవ ప్రకాశిక అనే ఈ గ్రంథం రచింపబడింది. అన్ని దోషాలను తొలగించే ఈ కృతిని ఎవరు ఒక్కసారి చదువుతారో, వారు  క్షమ దయ మొదలైన గుణాలను కలవారై సంసార సముద్రాన్ని దాటగలరు.

167 **సమ్పూర్ణా నిగమాన్తార్య వైభవస్య ప్రకాశికా,**
**శ్రీనివాసమహాసూరి రచితా బుధసమ్మతా**

నిగమాంత దేశికుల వైభవాన్ని పూర్తిగా ప్రకాశింప జేసేది, పండితులకు సమ్మతమైనది అయిన ఈ వేదాంత దేశిక వైభవ ప్రకాశిక అనే గ్రంథం శ్రీనివాస మహాసూరి అనే దొడ్డయాస్వామివారిచే రచింపబడింది.

**ఇతి శ్రీ వాధూలకులతిలక శ్రీనివాసాపరనామధేయ శ్రీ చణ్డమారుతం దొడ్డయాచార్యవర్యైర్విరచితా  శ్రీ వేదాన్తదేశిక వైభవప్రకాశికా సమాప్తా.**

**కవితార్కికసింహాయకల్యాణగుణశాలినే**
**శ్రీమతేవేఙ్కటేశాయ వేదాన్తగురవే నమః**

